శ్రీరస్తు

# ఆంధ్రవీరయువకులు

(మొదటి భాగము)



'ఆంధ్రభూమి' సంపాదకుఁడు

ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

వ్రాసిన

## శ్రీ ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ. రచియించిన గ్రంథములు

| | | రు.అ.పై. |
|---|---|---|
| 1. | ఆంధ్రరమణీమణులు (1-వ భాగము) | 0-12-0 |
| 2. | ఆంధ్రరమణీమణులు (2-వ భాగము) | 0-12-0 |
| 3. | కేయూరబాహు చరిత్ర ... | 0-12-0 |
| 4. | ఆంధ్రరాజభక్తులు ... | 0-12-0 |
| 5. | ఆకుకూరలు ... | 1- 0-0 |
| 6. | కాయకూరలు ... | 1- 0-0 |
| 7. | దుంపకూరలు ... | 1- 0-0 |
| 8. | వాణిజ్యపూజ్యాలు (1-వ భాగము) | 1- 0-0 |
| 9. | ఆంధ్రవిదుషీమణులు (-1వభాగము) | 1- 8-0 |
| 10. | ఫలజాతులు (మొదటిభాగము)... | 2- 0 0 |
| 11. | ఫలజాతులు (రెండవ భాగము) | 2- 8-0 |
| 12. | ఆంధ్రసారస్వతవ్యాసావళి ... | 2- 0-0 |
| 13. | దంతరక్షణ ... | 0- 4-0 |
| 14. | తేనె ... | 0- 4-0 |
| 15. | నిద్ర ... ... | 0- 4-0 |
| 16. | ఆవుపాలు ... ... | 0- 4-0 |
| 17. | విటమినులు ... ... | 0- 4-0 |
| 18. | ఖనిజలవణాలు ... ... | 0- 4-0 |
| 19. | చనుపాలు... ... ... | 0- 4-0 |
| 20. | శిరోజరక్షణ ... ... | 0- 4-0 |
| 21. | చర్మరక్షణ ... ... | 0- 4-0 |
| 22. | వెన్న : నెయ్యి... ... | 0- 4-0 |
| 28. | ఆంధ్రవీరయువకులు (1-భాగము) | 1- 0-0 |

ఆంధ్రభూమి బుక్కు డిపో, వేపేరి, మదరాసు : 7.

# మహావాక్యము

ఉ. మింతురు సత్వసంపద సమీరకుమారకుమార ముఖ్యులన్
నింతురు కీర్తి నల్గడల నిల్కడఁబొంది రణాగ్రవీథులన్
గాంతురు వీరధర్మ మతిగర్వితపర్వతవజ్రపాణులై
శంతతమానుషోదయవిచారులు వీరకుమారు లద్ధరన్.

— తెనాలి రామకృష్ణకవి.

*

* *

# విషయసూచిక



* *

*

౧

# వినాయక దేవుఁడు

కాకతీయాంధ్రసామ్రాజ్యకమలాప్తుఁడు, ఏకశిలా (ఓరు గల్లు) నగరాధిపతి ఐన వీరప్రతాపరుద్రదేవ చక్రవర్తిమీఁద చంద్రధ్వజులగు ఢిల్లీ మునల్మాను సైనికులు ఎనిమిదిసారులు ఎత్తివచ్చిరి.

శత్రుదుర్భేద్యములగు డెబ్బదియైదు దుర్గములకు అధీశ్వరుఁడు, అవక్రవిక్రములగు డెబ్బదియైదుగురు సామంతనాయకులచే సంసేవ్యమానుఁడు, వీరవరులగు నవలక్షధనుర్ధరులకు అధినాథుఁడు ఐన ఓరుగంటి ప్రతాపరుద్రదేవ చక్రవర్తి ఎత్తివచ్చిన ఢిల్లీ సేనలకు ఎదురొడ్డి నిలిచి వానిని ఏడుసారులు ఓడించెను. ఏడుసారులు యవనధాటీప్రవాహమును బంధించి ఆంధ్రభూమిని అరసిన అతఁడు ఎనిదవ దాడిలో దైవోపహతుఁడై ఓడిపోయెను. ఈ యోటమి జరిగినది క్రీస్తుశకము 1323–వ సంవత్సరములో.

త్రిలింగరాజ్యము యవనాక్రాంత మయ్యెను. ఓరుగంటికి సుల్తానుపూరు అను యవననామము ఉంచబడెను. ఆ సుల్తానుపూరుకోటనుండి త్రిలింగభూమిని పరిపాలించుటకు మహమ్మదీయ ముక్తియారులు నియమితులైరి.

ఆంధ్రభూమి యవనాక్రాంతముకాఁగానే ఇచటి హిందువులకు జీవనము అత్యంత దుర్భరమైనది.

నూతనపాలకులైన మహమ్మదీయులు త్రిలింగ దేశమును కొల్లగొట్టిరి; తెలుఁగుప్రజలను దోఁచుకొనిరి; మహమ్మదీయ మతగ్రంథమైన కురానునందు నమ్మకములేనివారిని కాఫర్లని కక్కసించిరి. నిర్దోషులైన హిందువులను ఎందఱనో చంపిరి; స్త్రీలను చెఱఁగొనిరి; దేవాలయములను ధ్వంసము చేసి మసీదులుగా మార్చిరి; పూజావిగ్రహములను విఱుగఁ గొట్టి పాదములతో మట్టివైచిరి; గోబ్రాహ్మణులను గోడు గుడిపిరి.

మహమ్మదీయపరిపాలనవలన నాఁటి తెనుఁగు దేశమునకు పట్టిన దుర్గతి సమకాలిక శాసనములలో ఉట్టంకితమై ఉన్నది; సమకాలిక చరిత్రకారుల వ్రాఁతలలో అక్షరమై ఉన్నది. సమకాలిక శిలాశాసనములు, సమకాలిక చరిత్రకారులు చెప్పిన మాటలలో కొన్ని :

"రాక్షసులవంటి తురుష్కులు హిందువులను కొండలకు తఱిమిరి; పల్లెపట్టులను పరశురామప్రీతి కావించిరి; తోఁటలు దొడ్లు తగులఁబెట్టిరి. నందనవనమువలె ఉండిన తెలంగాణము పచ్చముపాడై సర్వవిధముల శోభాదరిద్రాణమైనది.

పాపులయిన యవనులు వీరవిహారము సలిపి పంటపర్యాయములు లాగుకొనుటచేత దరిద్రులు, ధనికులు అను భేదము లేక రైతులకుటుంబములన్నియు నాశనము లయినవి. ఆమహావిపత్కాలమున దార, ధనము మొదలగు వేనియందును ప్రజలకు స్వాయత్తతాభావము లేకపోయినది.

అడవులనుబట్టి పోయినవారు పోఁగా మిగిలిఉన్న వ్యవసాయదారులపై మహమ్మదీయాధికారులు ఎక్కువపన్నులు

విధించిరి. పెచ్చుపన్నులు చెల్లింపనివారిని, చెల్లింపలేకపోయిన వారిని వీఁపులు చిట్లఁగొట్టిరి.

తురకలదండు వచ్చుచున్నదనువార్త చెవిని పడుటతోడనే దుర్గాధిపతులే అశ్వభటాకులములైన తమ దుర్గములను విడిచి భయవిహ్వాలులై అడవులపాలగుచుండిరనిన ఇఁక భూమిమీఁది సామాన్యజనుల సంగతి ఏమని చెప్పవచ్చును?

స్వచ్ఛందవిహారముచేయుట, కల్లుత్రాగుట, బ్రాహ్మణులను చంపుట ఇవి నాఁటి యవనాధముల వృత్తి.

నాఁటి బ్రాహ్మణుఁడు స్వమతమును విడిచి మహమ్మదీయమతమును స్వీకరింపవలయును. లేదా, అగ్నికి ఆహుతుఁడగుటకు ఆయత్తుఁడు కావలయును. ప్రాయికముగా బ్రాహ్మణులు మతాంతరులగుటకు అంగీకరింపకుండిరి. మహమ్మదీయమతము స్వీకరింపనొల్లని బ్రాహ్మణుల పాణులు, పాదములు కలిపి కట్టి మండెడుమంటలో త్రోయువారు ముసల్మానులు.

వారు దేవాలయములను పడఁగొట్టువారు, ఇనుపగొడ్డళ్ళతో దేవతావిగ్రహముల మెడలు విఱుగఁగొట్టువారు. అంతతో పోవక వారు విఱిగిన విగ్రహములను పాదములతో మట్టువారు.

గోవులను చంపి, అనేకమైన అకృత్యములు చేసి ముసల్మానులు హిందువులను పెక్కుభంగుల అవమానించిరి.''

ఇంతకుముందుకూడ ఇక్కడ యుద్ధములు ఉండునవి. అవి హైందవరాజులనడుమ నడచిన యుద్ధములు. ఆ యుద్ధములలో దుర్గములు, ప్రదేశములు చేతులు మారుచుండునవే కాని ప్రజలకు చెప్పఁదగిన పెద్దపీడలుఏమియు ఉండునవికావు.

కాని ఇప్పటి యుద్ధములు మతాంతరులతో. ఈయుద్ధములల అనుభవములు విపరీతములైనవిగా, విపత్కరములైనవిగా ఉండి హిందువులకు మిక్కిలి పీడాకరములైనవి.

ఈ స్థితికి సహింపక అభిమానధనమైన ఆంధ్రప్రజానీకము ఢిల్లీ ముసల్మానుసుల్తానుప్రభుత్వముపై తిరుగుబాటుకు సంసిద్ధమైనది. ఈ తిరుగుఁబాటుసంరంభమునకు ముసునూరి ప్రోలయనాయకుఁడు నాయకుఁడై నిలిచెను.

ప్రతాపరుద్రుని డెబ్బదియైదుగురు సామంతనాయకులలో ప్రోలయనాయకుఁడు ఒకఁడు. గోదావరిమన్యములోని రేకపల్లిప్రాంతమున అతని నాయంకరము.

డెబ్బదియైదుగురుసామంతనాయకులును నాయకుఁడులేని వారై యున్న విపరీతసమయములో, దేశము వైదికధర్మవైరులగు మహమ్మదీయులకు వశమైయున్న విపత్కరకాలములో ప్రోలయనాయకుఁడు ధైర్యము చిక్కపట్టి స్వదేశ, స్వధర్మ, స్వమతరక్షణకు బద్ధకంకణుఁడయ్యెను. చెదరిపోయిన నాయకులను అతఁడు తననాయకత్వముక్రిందకు చేరఁదీసి మహమ్మదీయపరిపాలకులపై తిరుగుబాటుబావుటా ఎత్తెను. త్రిలింగదేశమునందలి ప్రజానీకమంతయు స్వదేశ, స్వధర్మ, స్వమతరక్షణార్థము ఉద్దీపితమై ప్రోలయనాయకుఁడు లేవఁదీసిన ఈ యుద్యమమునకు బాసటయై నిలిచెను.

ప్రోలయనాయకుఁడు మహావీరుఁడు; మహాసాహసికుఁడు. కాఁగా అతఁడు విక్రమించి ప్రజానీకముతోడ్పాటుతో, నాయకుల సాహాయ్యముతో మహమ్మదీయ సేనలను చీల్చి చెండాడి వారాక్రమించియుండిన ఆంధ్రదుర్గములను ఒక్కొక్కదానినే

తిరిగి స్వాధీనము చేసికొని మహమ్మదీయ ముక్తియార్లను తఱిమివేసెను. ప్రోలయనాయకుఁడు తన బాహుబలము చేతను, తన అవక్రవిక్రమము చేతను తెలంగాణమున యవనుల ఆధిపత్యమును అంతమొందించెను.

యవనులకు ప్రోలయనాయకుని పేరు ఉచ్చాటనమంత్రమైనది. ప్రోలయ ఎత్తివచ్చుచున్న ఘోలఁకువ చెవికి చేరుటతోడనే యవనులు దుర్గములను విడిచిపెట్టి పాఱిపోవువారు. అంతదనుక యవనులచే బాధింపఁబడుచు వారనిన అడలుచుండిన వారే ఇప్పుడు విక్రమించి వారిని తుదముట్టించుచు వచ్చిరి.

గోదావరిమన్యములోని రేకపల్లిని రాజధానిగా చేసికొని ఆ యాంధ్రవీరవరుఁడు ముసల్మానులమీఁద తిరుగుఁబాటు నెఱపి తెనుఁగుగడ్డమీఁద తిరిగి 1326 లో హిందూరాజ్యమును స్థాపించెను. తిరిగి హిందూధర్మమును నెలకొలిపెను. ఆదికాలమున వారిధిమగ్నమైన వసుమతిని ఉద్ధరించిన ఆదివరాహమూర్తివలె ఆనాఁడు ప్రోలయనాయకుఁడు యవనోదరస్థమగు ఆంధ్రభూమిని పైకెత్తి ప్రతిష్ఠించెను.

'అవక్రవిక్రమయశస్సంభావ్యబాహార్గళుఁ'డగు ప్రోలయనాయకుఁడు చనిపోయిన వెనుక ఈ రాజ్యమునకు అతని పితృవ్యపుత్రుఁడైన కాపయనాయకుఁడు రాజై ఆంధ్రభూమిని శాసించెను.

కాపయనాయకుఁడు వీరుఁడు; దక్షుఁడు. కాగా అతఁడు దీక్షవహించి మఱి పదియేండ్లలో ఓరుగల్లునుండి ముసల్మానులను మూలముట్టుగ తఱిమివేసెను. ఆంధ్రనగరమైన ఏకశిలానగరమున తిరిగి హిందువుల బావుటా వెలసినది.

ఇట్లు ఆంధ్రక్షోణీరక్షణదక్షుండైన కాపయనాయకుండు ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణ, సమస్తరాజాశ్రయ మున్నగు బిరుదులు తాల్చి బీరము వహించెను.

తెలుఁగువారి వీరప్రతాపములవలన తెలంగాణమునుండి ముసల్మానులు మూటముల్లె కట్టుకొని వెళ్ళిపోయిరి. ఆనాఁడు మహారాష్ట్రమున అట్టి వీరప్రతాపములు, ఐక్యజాతీయభావము కొఱవడుటచే కలుబరిగి (గుల్బర్గా) ప్రాంతమున స్థిరపడి ముహమ్మదీయులు క్రొత్తరాజ్యమును ఒకదానిని స్థాపించకలిగిరి.

అదియే బహమనీరాజ్యము. దాని స్థాపనము క్రీస్తుశకము 1347 లో. స్థాపకునినామము సుల్తాను అల్లాఉద్దీన్ హసన్ షా బహమనీ. కాపయనాయకునివలెనే అతఁడుకూడ ఢిల్లీకి ఎదురుతిరిగి స్వతంత్రరాజ్యము స్థాపించెను.

ఇరుగుపొరుగు రాజులైన అల్లాఉద్దీన్ కు, కాపయనాయకునకు అన్యోన్యజయకాంక్ష పొడమినది. జరిగిన యుద్ధములో అల్లాఉద్దీన్ హసన్ షాయే గెలిచెను. అప్పుడు కాపయనాయకుఁడు గుల్బర్గారాజ్యపు సరిహద్దులో తన పాలితప్రదేశమున ఉన్న కైలాస (కౌలాస్) కోటను దాని సామంతప్రదేశములతోకూడ హసన్ షాకు ఇచ్చి సంధి చేసికొనెను. ఈ సంధి జరిగినతరువాతకూడ క్రీస్తుశకము 1357-వ సంవత్సరములో హసన్ షా మఱియొకసారి కాపయనాయకునిమీఁద ఎత్తి వచ్చెను. ఒకఏఁడాదిపాటు ఆ సుల్తాను తెలంగాణమున వీరవిహారము సలిపెను. భువనగిరిదుర్గమును, దాని పాలితప్రదేశమును స్వాధీనము చేసికొనెను.

1359 లో హసన్ షా చనిపోఁగా అతనికొడుకు ముహమ్మదుషా గుల్బర్గారాజ్యమునకు రాజయ్యెను.

ఆ కాలమున హంపివిజయనగరమున హరిహరరాయలు ఏలుబడి సాగించుచుండెను. కాపయనాయకునినుండి లాగుకొని నట్లే బహమనిసుల్తాను హరిహరరాయలనుండికూడ కొంత ప్రదేశమును లాగుకొనెను. అందుచేత కాపయనాయకునకు వలెనే హరిహరరాయఁకుకూడ బహమనీసుల్తానుపట్ల క్రోధము ఏర్పడెను. బహమనీసుల్తాను నోడించుటకు వారు ఉభయులును ఏకమయి ప్రయత్నములు సాగించిరి.

ఈప్రయత్నములు కార్యరూపమును తాల్చుటయుగుల్బ ర్గాలో ముహమ్మద్ షాసుల్తాను అగుటయు ఒకేసారి జరిగెను. హైందవరాజులయిన హరిహరరాయలును, కాపయనాయకుఁడును బహమనీరాజ్యములోని హైందవధనస్వాములకు రహస్య ముగ కబురులు పెట్టిరి. వారిస్వాధీనములోఉన్న, వారిస్వాధీన మునకువచ్చెడు బహమసీరాజు బంగారునాణెములను అన్నిఁటిని వారు కరఁగించివేయవలయును. అట్లు కరఁగించివేయుటవలన బహమనీరాజ్యమున హైందవరాజులబంగారునాణెములే చెలా మణిలో ఉండును. బహమనీసుల్తానుకు ఆర్థికముగ ఇది ఇబ్బంది కలిగించును.

ఆర్థికముగ ఇట్టి చిక్కు కలిగించుటకు తోడు హరిహర రాయలును, కాపయనాయకుఁడును తమతమ రాజ్యప్రదేశము లను తమకు తిరిగి ఇచ్చివేయవలసినదిగ ముహమ్మద్ షాను రాయబారుల మూలముగ కోరిరి.

ముహమ్మదుషా ప్రజ్ఞామతి. కాఁగా అతఁడు ఒకయుక్తి పన్నెను. విజయనగరమునుండియు, ఓరుగంటినుండియువచ్చిన

రాయబారులను సంప్రదింపులు సాగించుసాకున తనవద్ద నిలుపు కొనెను. తనరాయబారులను విజయనగరమునకుఒకనిని, ఓరు గంటికి ఒకనిని పంపెను. రాయబారములు నెఱపు నెపముతో పదునెనిమిదిమాసములకుపైఁగా కాలహరణము చేసెను.

ఈ పదునెనిమిదిమాసములలో ముహమ్మదుషా తన సేనను మిక్కిలి పెంపొందించుకొనెను. రక్షణయుద్ధమునకు, విజయయాత్రకు-రెండుపనులకును-పనికివచ్చునట్లుగా సేనను సన్నాహసుందరము చేసెను.

సర్వవిధముల సమాయత్తుఁడైన పిమ్మట ముహమ్మదుషా విజయనగర, ఏకశిలానగర ప్రభువులు తనను కోరిన కోరికల స్మరణమే యెత్తకుండ తాను వారిని ఎదురుకోరికలు కోరెను. ఆరాజులు ఉభయులును తనకు సామంతులు కావున మదపు టేనుగులమీఁద కప్పములు, కానుకలువైచి తనవద్దకు పంప వలెనని ఆజ్ఞాపించెను.

ఇందుతో కాపయనాయకునకు కోపము పేరెత్తినది. తోడనే అతఁడు దన తనయుఁడైన వినాయక దేవునకు విశేష సైన్యమును తోడిచ్చి ముహమ్మదుషామీఁదికి పంపెను.

ముహమ్మదుషాతండ్రి హసన్ షా కాపయనాయకుని నుండి లాగుకొనిన కైలాసకోటను, భువనగిరిదుర్గమును వాని సామంతప్రదేశములతో జయించి ఓరుగంటిరాజ్యములో కలుపవలసిన గురుతర బాధ్యత వినాయక దేవునిపయిఁబడెను.

వినాయక దేవునకు సహాయముగా అప్పటి విజయనగర రాజు బుక్కరాయలు ఇరువదివేల ఆశ్వికదళమును పంపెను.

వినాయక దేవుని సేనలు, విజయనగర సేనలు కలియ

రాదని ముహమ్మదుషా పట్టు. కాఁగా అతఁడు బహదూర్ ఖాను అను తనసేనానిని కొంత సేనతో వినాయక దేవుని మీఁదకు పంపి తాను కొంత సేనను తీసికొని విజయనగర సేనను ఎదిరించుటకు పోయెను.

ముహమ్మద్ షా విజయనగర సేనలను జయించెను. విజయనగర రాజ్యప్రదేశమును కొంత కొల్లగొట్టి అమూల్యము లైన ఆభరణములను, అపూర్వములైన అరబ్బుగుఱ్ఱములను, నడగొండలవంటి ఏనుఁగులను చేఁజిక్కించుకొని ఆతఁడు తన రాజధానీనగరమైన గుల్బర్గాకు తిరిగి వెళ్ళెను.

విజయనగర సేనను ముహమ్మదుషా సులువుగ జయించెను. వినాయక దేవుని సేనను బహదూర్ ఖానుమాత్రము జయించలేకపోయెను. ఆయుద్ధమున విజయలక్ష్మి వీరయువకుఁడైన వినాయక దేవుని వరించెను.

1357 లో ఎత్తివచ్చి అల్లావుద్దీన్ హసన్ షా కాపయ నాయకునినుండి లాగుకొనిన భువనగిరిదుర్గమును, దాని పాలిత ప్రదేశమును వినాయక దేవుఁడు విక్రమించి స్వాధీనముచేసి కొనెను. ఈవిజయము పొసఁగినది క్రీస్తుశకము 1361 లో.

తనతండ్రినుండి కలుబరిగిసుల్తాను లాగుకొనిన రెండు దుర్గములలో ఒకటియైన భువనగిరి తనకు లోఁగినది. ఇఁక కైలాసకోట లోఁగొనవలసిఉన్నది. ఎంతమాత్రమును జాగు చేయక వినాయక దేవుఁడు కైలాసకోటకొఱకు సమరము సాగించెను.

కాని ఈసమరమున వినాయక దేవుఁడు ఓడిపోయి తన జాగీరుదుర్గమైన వెలంపుట్టన్ లో దాగుకొని ఎదురుదెబ్బతీయు.

టకు అనువైన కాలమునకై ఎదురుచూచుచుండెను. ఆ పరిస్థి తులలో బహదూర్ ఖాను ఓరుగంటి పొలిమేరలవఱకుపోడుచు కొనిపోయెను. ప్రాప్తకాలజ్ఞుఁడు కావున కాపయనాయకుఁడు పరిస్థితులు గమనించి ఇరువదియైదుఏనుఁగులు, లక్షలకొలఁది ధనము, అనేకములైన అమూల్యాభరణములు ఇచ్చి బహదూర్ ఖానుతో సంధి చేసికొనెను.

ఇట్లు చేసికొనిన ఈసంధి చేసికొనినంతసేపైన నిలఁబడలేదు. అచిరకాలముననే ఓరుగంటివారికిని, గుల్బర్గావారికిని తిరిగి యుద్ధము పొసఁగినది.

గుఱ్ఱపువర్తకులు కొందఱు ప్రశస్తములైన అశ్వములను కొన్నిఁటిని ముహమ్మదుషాకు అమ్ముటకై వెలంపుట్టన్ మీఁదుగా గుల్బర్గాకు తీసికొనిపోవుచుండిరి. యుద్ధప్రశంసలో ఉన్న వినాయకదేవుఁడు యుద్ధకార్యకలాపములకు అత్యవసరములయిన ఆ గుఱ్ఱములను చూచెను. తిరిగి ఆయత్తుఁడై గుల్బర్గా సుల్తానును జయించవలయునని అతఁడు ఆతురుఁడై ఉండెను. కాఁగా ఆ యశ్వములపై అతనికి ప్రలోభము పుట్టినది. ఆ గుఱ్ఱములలో మంచివి ఎంచి విలిచి తాను నిలుపుకొనెను. వానిని ముహమ్మద్ షాకు అమ్ముటకు ప్రత్యేకము కొనిపోవుచుంటిమని వర్తకులు చెప్పిరి. అగుఁగాక ! అమ్మకపు సరకును ఎవరైన కొనవచ్చును. ఆ కొనుటకు ఆంక్ష ఏమి ? కాఁగా వర్తకులు చెప్పినమాటలను వినాయకదేవుఁడు వినిపించుకొననేలేదు.

వినాయకదేవుఁడు ఏరుకొని విలిచికొనఁగా మిగిలినగుఱ్ఱములను తరలించుకొని ఆ వర్తకులుగుల్బర్గాకుపోయిరి. అక్కడ ముహమ్మదుషా గుఱ్ఱములనుచూచి పెదవివిఱిచి ఇట్టి నాసి

రకపు గుఱ్ఱములను ఎందులకు తెచ్చినారని వర్తకులమీఁద కోపము చేసెను.

అప్పుడు వర్తకులు తాము కొనివచ్చిన గుఱ్ఱములలో మంచివానిని వెలంపుట్టన్ వినాయక దేవుఁడు వెలకు తీసికొని ఉండుటను ముహమ్మద్ షాకు చెప్పిరి.

తన సేనలచే పరాజితుఁడైన వినాయక దేవుఁడు తనకై కొనిరాబడుచున్న గుఱ్ఱములలో మంచివానిని ఎంచి తీసికొనుటయా? ఎంతటి తెంపరితనము? ఇంతకంటె తనకు అవమానకర కార్యము వేఱేమి ఉండగలదు? వినాయక దేవునకు వెంటనే బుద్ధి చెప్పవలయును. లేనిచో మఱింత అలుసగును. ఇట్లు తలఁచి ముహమ్మద్ షా సేనాసమేతుఁడై వెలంపుట్టన్ మీఁదికి ఎత్తివెళ్లెను.

నాలుగువేల గుఱ్ఱపుదళమును మాత్రము తీసికొని అతఁడు మహాజవముతో ప్రయాణము సాగించెను.

తురగముల మూలమున పొసఁగిన యుద్ధము అది. ఆ యుద్ధమున జయించుటకు తురగబలముతో అతఁడు బయలుదేఱెను. ఆ తురగబలము తురగజవమునకు మించిన జవముతో నడచి చినది. అంతియకాదు. తురగప్రశంసతోడనే వెలంపుట్టన్ కోటకావలివాండ్రను పందిరి పెట్టవలయునని పాదుషాపథకము.

ముహమ్మద్ షా తనసైనికులలో కొందఱను గుఱ్ఱపు వర్తకుల వేషములతో వెలంపుట్టన్‌కు పోయి కోటకావలివాండ్రతో మాటలుకలిపి మభ్యపెట్టవలసినదిగా చెప్పిపంపెను.

గుల్బర్గాకు పోవు వర్తకులవద్ద తమ ఏలిక గుఱ్ఱములను ఎంచి తీసికొని ఎన్నియోదినములు కాలేదు. ఇంతలో ఇప్పుడు

తిరిగి మఱికొందఱు గుఱ్ఱపువర్తకులు వచ్చిరి. వారువచ్చి కోట కావలివాండ్రతో తమగుఱ్ఱములను దారిలో దొంగలు తీసికొనిపోయిరని కతలు పుట్టించి చెప్పిరి. విషయము ప్రసక్తానుప్రసక్తముగ ఉండెను. కాఁగా, కోటకావలివాండ్రు చెవులు నిక్కఁబెట్టుకొని గుఱ్ఱపువర్తకుల గోడు వినుచుండిరి. వినుచు కోటరక్షణకార్యముపట్ల ప్రమత్తులైనారు.

వారు అట్లు ప్రమత్తులైఉండఁగానే ముహమ్మదుషా ఆశ్వికదళము వచ్చి కోటముందు నిలిచినది.

కోటముఁదు నిలిచినది. అని చెప్పుట తప్పు. కోటగుమ్మములు దాఁటి కోటలో ప్రవేశించినదని చెప్పవలెను.

గుల్బర్గాలో బయలుదేఱిన వారమురోజులలోనే ముహమ్మద్ షా ఆశ్వికదళముతో వచ్చి వెలంపుట్టన్ కోటలో ప్రవేశించెను.

అతర్కితముగ ఉపపన్నమైన ఈదాడికి ఆంధ్రవీరుఁడు వినాయకదేవుఁడు సంసిద్ధుఁడై యుండలేదు. కాఁగా అతఁడు లోపలికోటలో ప్రవేశించి రక్షణ కార్యకలాపములలో మగ్నుఁ డయ్యెను.

వెలంపుట్టన్ నగరములో ముహమ్మదుషా సైనికులు వీరవిహారము సలిపిరి; చేఁజిక్కిన హిందువుల నందఱను చిత్రవధచేసిరి; వినాయకదేవునికోటను దీక్షతో ముట్టడించిరి.

నెట్టుకొనుచున్న ఆముట్టడికి తనకోట తట్టుకొని కొన్ని దినములైన నిలఁబడలేదని వినాయకదేవుఁడు గుర్తించెను. కాఁగా తప్పించుకొనిపోవుటకు అతఁడు యత్నించెను. కాని ఆ యత్నములో అతఁడు ముహమ్మదుషా సైనికులకు చిక్కెను.

వినాయక దేవుఁడు చేఁజిక్కెను. గుఱ్ఱములవిషయమై అతఁడు చేసిన చేఁతకు క్షమాపణచెప్పవలసినదిగా షా ఆజ్ఞాపించెను.

వర్తకులు తీసికొనిపోవుచున్న వానిని కొనుటకు ఆంక్షయేమి? ఆ సందర్భపు ప్రశ్నకు సమాధానమే అక్కఱలేక పోఁగా క్షమాపణ చెప్పనేల?

వినాయక దేవుఁడు క్షమాపణ చెప్పలేదు. తగుసమాధానమైనను చెప్పలేదు. బందీఐనందులకు వినయవినమితుఁడును కాలేదు. రాచఠీవిని వీడలేదు. దర్పమును పోనాడలేదు. రాజగువాఁడు తోడిరాజుతో మాటలాడినట్లే వినాయక దేవుఁడు ముహమ్మద్‌షాతో మాటలాడెను.

ఇందుతో ముహమ్మదుషాకు పట్టరానికోపమువచ్చినది. ఆ కోపపారవశ్యస్థితిలో అతఁడు వినాయక దేవుని నాలుక కోసివేయవలసినదిగా, క్రింద పెద్దమంట చేసి కోటబురుజుమీఁదనుండి ఆ మంటలోనికి అతనిని తోసివేయవలసినదిగా ఆజ్ఞాపించెను.

ఆంధ్రవీరయువకుఁడు వినాయక దేవుఁడు ఆ దారుణ శిక్షకు వికలుఁడుకాక లోఁగెను.

క్రీస్తుశకము 1362 లో నడచిన వినాయక దేవుఁడు ముహమ్మదుషాల ఈ యుదంతమును చదువుచుండగా అప్పటికి పదునారువందలసంవత్సరములకు పూర్వము జరిగిన పురుషోత్తముఁడు, అలెగ్జాండరుల ఉదంతము మనకు జ్ఞప్తికివచ్చును.

అప్పుడు ఎత్తివచ్చిన అలెగ్జాండరుచేతులలో పురుషోత్తముఁడు బందీగా పట్టుబడినట్లే ఇప్పుడు ఎత్తివచ్చిన ముహమ్మదుషాచేతులలో వినాయక దేవుఁడు బందీగా పట్టుపడెను.

అప్పుడు అలెగ్జాండరు నీకు ఎట్టి మన్నన కావలయునని పురుషోత్తముని పృచ్ఛించినట్లే ఇప్పుడు ముహమ్మదుషా నీకు ఎట్టి మన్నన కావలయునని వినాయకదేవుని ప్రశ్నించె నన వచ్చును.

అప్పుడు సమాధానముగ పురుషోత్తముఁడు తనకు రాజోచితమైన మన్ననయే కావలయునన్నట్లు, ఇప్పుడు సమాధానముగ వినాయకదేవుఁడు తనకు రాజోచితమైన మన్ననయే కావలయునన్నట్లు వ్యవహరించె ననవచ్చును.

ఈ యుదంతముల సాదృశ్యము ఇంతతో అంతమగుచున్నది.

యుద్ధమున ఓడినను రాచఠీవిని ఓటుపుచ్చని, బందీగా పట్టుబడియు ప్రాభవమును పోకడవెట్టని పురుషోత్తముని చిత్తస్థైర్యమును, హృదయగాంభీర్యమును అలెగ్జాండరు అప్పుడు మెచ్చుకలిగెను. యుద్ధమున ఓడినను రాజఠీవిని ఓటుపుచ్చని, బందీగా పట్టుబడియు ప్రాభవమును పోకడవెట్టని వినాయకదేవుని చిత్తస్థైర్యమును, హృదయగాంభీర్యమును ముహమ్మదుషా ఇప్పుడు మెచ్చలేకపోయెను.

అలెగ్జాండరు ఉదారుఁడు, ఉచితజ్ఞుఁడు అగుటయు — ముహమ్మదుషా అట్టివాఁడు కాకుండుటయు ఈ వ్యత్యస్తమునకు కారణము.

వినాయకదేవుని దారుణమరణశిక్షకు గుఱిచేసి ఆమీఁద ముహమ్మదుషా వెలంపుట్టన్ నగరమును ఊఁచముట్టుగ దోఁచుకొనెను; చిత్రవధ తప్పించుకొని జీవించియున్న నగరవాసుల

మీఁద అపరాధపుపన్ను విధించి వసూలుచేసెను. కొద్ది రోజులుమాత్రమే అక్కడ ఉండి గుల్బర్గాకు తిరుగుప్రయాణము కట్టెను.

తమ యువకవీరుని దారుణముగ చంపిన ముహమ్మదుషాపట్ల ఆంధ్రప్రజలు ఆగ్రహోదగ్రులైరి. సుల్తానుని ఇతర దుష్టచేష్టితములు వారి ఆగ్రహాగ్నిని ప్రజ్వలింపఁజేయు ఇంధనములైనవి. కాఁగా వారు ముహమ్మదుషామీఁద కసితీర్చుకొనుటకు కంకణము కట్టుకొనిరి.

కాని వారిని నడుపుటకు నాయకుఁడులేఁడు; ఆయుధసామగ్రియు అరకొరగా ఉండెను. అగుట వారు పగటిపూట దాఁగుకొనుచు రాత్రులందు ఏమరుపాటున సుల్తానుసైనికుల మీఁదఁబడి కాటించుచు వచ్చిరి.

విజేతలై మఱలుచుండియు ముహమ్మదుషా సైనికులు ఈ గొరిల్లాకాటింపునకు తట్టుకొనలేకపోయిరి. అందుచేత తాము వెలంపుట్టన్‌లో దోఁచుకున్న వెండిబంగారములు తప్ప తక్కిన సామగ్రినంతను తగులబెట్టివేయవలసినదిగ ముహమ్మదుషా ఆదేశించెను.

ఇట్లు సామాను తగ్గించుకొనుటచే సత్వరప్రయాణసౌలభ్యము సమకూడునని అతఁడు ఆశించెను. కాని సత్వరప్రయాణమునకూడ తెనుఁగుప్రజలపీడనము అతనికి తప్పలేదు. కైలాసకోటకు చేరులోపున ఆంధ్రప్రజలు ఆ సేనలో మూఁడింట రెండువంతులు నాశనముచేసిరి; ముహమ్మదుషాచేతిని గాయపఱిచిరి.

కైలాసకోటలో సహాయార్థము క్రొత్తసేనలు వచ్చి ముహమ్మదుషాహతశేషసైన్యమును కలిసినవి. అగుట అక్కడ

నుండి వారి ప్రయాణము సవ్యముగ సాగినది.

యువకుఁడు, వీరుఁడు, పుత్రుఁడు ఐన వినాయక దేవుని మరణమునకు కాపయనాయకుఁడు దుఃఖసముద్రమున మునిఁగెను.

ఇప్పుడు ఓరుగంటిరాజ్యమున నడచిన ఈ యువకవీర మరణమువంటిదే ఎనుబదిసంవత్సరములకు పూర్వము ఢిల్లీ రాజ్యమునను నడచియుండెను.

ఢిల్లీ రాజ్యసింహాసనమున బాల్బన్ ఉపవిష్టుఁడై ఉండిన తరుణమున (క్రీస్తుశకము 1285-వ సంవత్సరమున) ఆ రాజ్యముపైకి ఛింఘిజ్ ఖాను అను విఖ్యాతవీరుఁడు ఎత్తివచ్చెను. ఆ అతిలోకవీరునితో పోరుటకు బాల్బన్ తన కుమారుఁడు, వీరుఁడు ఐన ముహమ్మద్‌ను ససైన్యముగ పంపెను.

ఆ యుద్ధమున ముహమ్మద్ ఓడిపోవుటయేగాక ఛింఘిజ్ ఖాను చేతులలో ససైన్యముగ సమసెను.

ముహమ్మద్ మరణమునకు తండ్రి బాల్బన్‌తోఁబాటు రాజ్యములోని ప్రజయును గోడుగోడున దుఃఖించెను. ఇప్పుడు ఇక్కడ వినాయక దేవుని విషయమునకూడ అట్లే జరిగెను.

ప్రాయమువాఁడు, ప్రయోజకుఁడు ఐన కొడుకు మరణము తండ్రికి హృదయవిదారకమైనదే. ప్రాయమువాఁడు, ప్రయోజకుఁడుమాత్రమే కాక జాతీయవీరుఁడుకూడ అగుటచే వినాయక దేవుని మరణము ఆనాఁటి తెనుఁగుప్రజలకును అత్యంతశోచనీయమైనది.

ముహమ్మదీయుల బారినుంచి తమ్ము రక్షించు వీరాధికుఁడని తాము నమ్మిన వినాయక దేవుఁడు కాలవిపర్యాసము వలన ముహమ్మదుషా చేతులలో దారుణమరణమునకు గుఱి

కాఁగా ఆనాఁటి తెనుఁగుప్రజలు జాతీయభావప్రేరితులై తమకు చేతనైన విధముగ తమ నాయకుని శత్రువుపట్ల ప్రతీకారము నెఱపిరి.

వారి ప్రతీకారమువలన ముహమ్మదుషాకు చావుతప్పి కన్నులొట్టపోయినంత పని ఐనది. విజేతయై మఱలుచుండియు అతఁడు పగటిపూటమాత్రమే ప్రయాణము చేసియుండెను; శత్రువులు ఎప్పుడు మీఁదఁబడుదురో అను భయముచే అతని స్కంధావారమున సైనికులు రాత్రులు నిద్రపోవుటఎట్టిదో ఎఱుఁగకుండిరి; సామగ్రితగ్గించుకొనుటకు వారు గుడారములను కూడ తగులఁబెట్టుకొనవలసినవారైరి; ఎత్తివచ్చినప్పుడు నాలుగువేలుగ ఉండిన అతని బలఁగము తిరిగిపోవుసరికి పదునైదువందలు మాత్రమే ఉండెను. మంది తగ్గుటయేకాదు ఆంధ్రవీరుల పోటుమూలమున అతనిచేతికి గాయముతగిలినది.

ఉత్తరహిందూస్థానమున ఢిల్లీరాజ్యము ముహమ్మదీయులవశమైన మూడువందలఏండ్లకు కాని దక్షిణాపథములోని ఆంధ్రరాజ్యమునకు ముహమ్మదీయసేనల తాఁకుడుతగులలేదు. ఎనిమిదిదాడులు జరిగినమీఁదట కానిఆంధ్రరాజ్యముముహమ్మదీయులకు లోఁగలేదు. లోఁగిన మూడేండ్లకే ఆంధ్రులుముహమ్మదీయులపై తిరుగఁబడిరి. తిరుగఁబడిన పుష్కరములోనే ఆంధ్రులు ముహమ్మదీయులను తమదేశమునుండితఱిమివేసిరి.

తెనుఁగుపొలిమేరలు దాఁటిపోవ తోలివైచినతురకలు తిరిగి ఈ పొలిమేరలలోనికి వచ్చి కాలూఁది నిలువకుండుటకై ఆంధ్రసురత్రాణుఁడు కాపయనాయకుఁడు అత్యంతదీక్ష వహించెను.

ఆదీక్షలో తండ్రి కాపయనాయకునకు తనయుఁడు వినాయక దేవుఁడు యథాశక్తి తోడుపడెను. పర్యవసానము ఎట్టిదైనను ఆయుద్ధమున తండ్రిచాటు ఆ తరుణుఁడు వీరునివలె ప్రవర్తించెను; వీరునివలె పంచత్వమొందెను.

సమిజ్జయసంధాని కాకపోవును కాక వినాయక దేవుఁడు నెఱపినది విక్రమమే.

శాతవాహనుల కాలమున, కాకతి రాజుల కాలమున, విజయనగర రాజుల కాలమున యవనధాటిని అరికట్టి స్వదేశ, స్వమత, స్వగౌరవములను రక్షించుకొనుటకు ఆంధ్రవీరవరులు రణక్షేత్రమున తమశిరఃప్రకరములను పూలచెండ్లవలె సమర్పించి అనన్యసామాన్యక్షాత్ర తేజమును ప్రదర్శించిరి. సమరసింహులును, పౌరుషప్రధానులు అయిన అట్టి ఆంధ్రవీరవరులందు యువకులవర్గమునకు చెందినవారిలో వినాయక దేవుఁడు మీనుమిగిలినవాఁడు.

యవనధాటీప్రవాహమును బంధించి ఆ
ర్యావర్తమరసిన ఆంధ్రజాతి
జయవదితిహాసమాత్రభాగ్యములు నేఁడు
త్రవ్వి యెత్తిన ప్రాఁతజాదండకవిలె
జదువుకోవలసెను నమ్మఁజాలనట్టి
కట్టుకథ లటు, సహింపఁగలవె? ఆంధ్ర!

—రాయప్రోలు సుబ్బారావు

## ౨

# లింగమనేఁడు

చ. కదనమె బొమ్మరిల్లు, చెలికత్తెలె వీరజయాంగనామణుల్,
మదకరిమస్తకుంభములె మాటికి దొంతులు, సంగరస్థలిన్
గుదికొనిపడ్డ రాహుతుల క్రొవ్వులె గుజ్జనగూళ్లు తార! స
మ్మదభుజశౌర్య రావుకులమాదయలింగని ఖడ్గపుత్రికిన్.

—వెలుగోటివారి వంశావళి

ఏకశిలానగరము రాజధానియై వఱలుచుండ వర్ధిల్లిన కాకతీయాంధ్రసామ్రాజ్యము క్రీస్తుశకము 1323 లో ముహమ్మదీయులకు లోఁగుటయు; అట్లు లోఁగిన మూఁడేండ్లలోనే ఆంధ్రులు ముసునూరి ప్రోలయనాయకుని ఆధ్వర్యమున ఆరాజ్యమునుండి ముహమ్మదీయులను తఱిమివేయుటయు, ప్రోలయనాయకుని అనంతరము కాపయనాయకుఁడు ఆంధ్రక్షోణీరక్షణదక్షుఁడై ఏకశిలానగరము రాజధానిగా తిరిగి త్రిలింగసామ్రాజ్యము నేలుటయు వినాయకదేవునిఉదంతమున వినియున్నాము.

సమిజ్జయసంధాయకుఁడు కాకుండుటకుతోడువినాయకదేవుఁడు తండ్రికంటె ముందు మరణించి జనకునకును, జన్మదేశమునకును మఱింత విషాదమును కూర్చెను. అందువలన కాపయనాయకుని కడకాలము అతనికికాని, అతనిపాలితప్రదేశమునకుకాని ప్రకాశమానమై ఉండియుండలేదు.

కాపయనాయకుఁడు కాలధర్మమునొందినపిమ్మట ఆంధ్రులు ఏకశిలానగరరాజ్యమును ప్రకాశమానముగ కాక పోయినను ఏకచక్రముగనైన నిలుపలేకపోయిరి. ఆయాంధ్ర సామ్రాజ్యము రెడ్డి, వెలమరాజ్యములుగా చీలిపోయినది.

గుంటూరుమండలములోని కొండవీడు రాజధానిగా రెడ్డిరాజ్యమును, నల్లగొండమండలములోని రాచకొండ రాజధానిగా వెలమరాజ్యమును వర్థిల్లినవి.

మన కథాకాలమునాఁటికి రెడ్డిరాజ్యము కొండవీడు, రాజమహేంద్రవరము అను రెండుభాగములుగాను; వెలమ రాజ్యము రాచకొండ, దేవరకొండ అను రెండుభాగములు గాను చీలినవి.

ఏర్పడుటలో, చీలిపోవుటలో ఇట్లు సాదృశ్యము నిబద్ధమైన ఈరెడ్డి, వెలమరాజ్యముల విషయమున ముఖ్యమైన భేదము ఒకటి ఉండినది.

రెండుగా చీలిన రెడ్డిరాజ్యములు – కొండవీడు, రాజమహేంద్రవరములు–అన్యోన్యము కలహించుచు ఒకదానిని ఒకటి నాశనము చేసికొనసర్వదాతలపడియుండెడివి. రెండుగా చీలిన వెలమరాజ్యములు – రాచకొండ, దేవరకొండలు – అన్యోన్యము కలహింపక మంచిఐకమత్యముతో వ్యవహరించుచుండెడివి.

కాఁగా ఆరెడ్డివెలమరాజ్యముల అన్యోన్యసమరములలో వెలమరాజ్యములు రెండును ఒక్కటిగాను, రెడ్డిరాజ్యములు రెండును విడివిడిగాను వ్యవహరించుచుండెడివి.

రాచకొండ, దేవరకొండలు రాజధానులుగా రాజ్య

నేలిన రేచర్ల వెలమరాజులకును; కొండవీడు, రాజమహేంద్ర వరములు రాజధానులుగా రాజ్య మేలిన పంటదేసటి రెడ్డి రాజులకును తరతరములుగ ప్రబలవిరోధము నడచుచుండెను.

మనకథాకాలమున కొండవీటిరెడ్డిరాజ్యమునకు పెద కోమటి వేమారెడ్డిప్రభువు. తనసోదరుఁడును, కొండపల్లిపరగణా సామంతప్రభువును, వ్యవహారనిర్ణయనిపుణుఁడును, షడ్గుణ ప్రయోగకుశలుఁడును ఐన మాచారెడ్డిని కొండవీటిరెడ్డిరాజ్య రక్షణనిమిత్తము నిలిపి పెదకోమటివేమారెడ్డి రాజమహేంద్ర వరపు రెడ్డిరాజ్యముమీఁదకు ఎత్తివెళ్లెను.

ఆ సమయమున దేవరకొండ వెలమప్రభువు రావు పిన వేదగిరినేఁడు కొండవీటిరెడ్డిరాజ్యముమీఁదకు ఎత్తివచ్చెను. కొండవీటిరాజ్యరక్షకుఁడు మాచారెడ్డికిని ఎత్తివచ్చిన పినవేద గిరికిని ధరణికోటవద్ద దారుణరణము జరిగెను.

షడ్గుణప్రయోగకుశలుఁడు, వ్యవహారనిర్ణయనిపుణుఁడు అయ్యు మాచారెడ్డి ఆయుద్ధములో ఓడిపోయెను. ఆతనిని బంధించి తలకొట్టి పినవేదగిరినేఁడు దేవరకొండకు కొనిపోయి దానిని తాను తాంబూలము ఉమియుపాత్రమున తాపించెను.

తాము ఓడించిన శత్రువు తల నఱికి దానిని తమ తమ్మ తసుఖనందు తాపించుకొనుట నాఁటి ఆంధ్రవీరుల వింతఆచార ములలో ఒకటియై ఉండెను. తమ్మపడిగలో తల తాపించి, దానిపై ఉమియుచుండుటతో వారు శత్రువుమీఁది తమ కసిని ఒకవిధముగా తీర్చుకొనువారు. శత్రువు సమసినపిమ్మట కూడ అట్లు అవమానించినగాని ఆనాఁటి ఆంధ్రవీరులకు అరి వీరులపట్ల అక్కసు తీరునదికాదు.

రాజమహేంద్రవరరాజ్యమున తాను రణప్రశంసలో ఉండఁగా కొండవీటిరాజ్యమున తనతమ్మునికి ఒనగూడిన పరాజయమును, జరిగిన పరాభవమును పెదకోమటివేమారెడ్డి తెలిసికొనెను.

సోదరుఁడు మాచారెడ్డి అనిన పెదకోమటివేమారెడ్డికి అనన్యమగు ప్రేమ. పెదకోమటివేమారెడ్డికిని మాచారెడ్డికిని పురాణప్రసిద్ధులైన రామలక్ష్మణులకుఉండిన సౌభ్రాత్రముండినది. కాఁగా సోదరునకు జరిగిన పరాభవమునకు ప్రతీకారము చేసి తీరవలయునని అతఁడు దీక్షవహించెను.

వెలమరాజ్యముమీఁదికి ఎత్తివెళ్లుటకు అతఁడు విపులసన్నాహములు కావించెను. సర్వసన్నద్ధుఁడై అతఁడు దేవరకొండ వెలమరాజ్యముమీఁదకు ఎత్తివెళ్లెను. దేవరకొండ వెలమప్రభువులు ఎదురుకొనిరి. వారికి రాచకొండ వెలమ ప్రభువులు తోడువచ్చిరి.

రాచకొండ, దేవరకొండ వెలమవీరులుకలిసి ఎదిరించినప్పటికి పెదకోమటివేమారెడ్డి విక్రమించి వారిని జయించెను. పినవేదగిరినేని పట్టుకొనెను; అతని సింహతలాట బిరుదును పుచ్చుకొనెను; అతని తల నఱికి కొండవీటికి తీసికొనిపోయి దానిని తన తమ్మపడిగములో తాపించుకొనెను; వీరనారాయణ బిరుదమును వహించెను.

తన తమ్మునితలను నఱికి తమ్మపడిగమున తాపించుకొని అవమానించిన పినవేదగిరినేని తలను నఱికి తన పతద్గ్రిహమున పొదిగించుకొని పెదకోమటివేమారెడ్డి ప్రతీకారము నెఱపెను.

ఈ అదనున ఈ అవమతికి ఆద్యబ్రహ్మలు వెలమలు;

దానికి రెడ్లు ప్రతీకారము నెఱపివైచిరి. అది అంతతో ముగిసిన బాగుండెడిది. కాని అది అంతతో పర్యవసితముకాలేదు.

కేవలముప్రతీకారముగా మాత్రమే రెడ్లునెఱపినది వెలమలకు భరింపరానిదైనది. రెడ్లమీఁద వెంటనే దెబ్బ తీయవలయునని వారు ప్రయత్నించిరి. కానిజరిగియున్న యుద్ధమున రాచకొండ, దేవరకొండ ప్రభువీరులు మరణించియుండిరి. కాఁగా క్రొత్తనాయకుని ఆవిర్భావముకోసము వారు తపస్సు ధారపోయవలసివచ్చెను.

వారి తపస్సు అచిరకాలముననే పండినది. క్రొత్తగా ఒకవీరుడు పుట్టిరానక్కఱ లేకపోయినది. పుట్టిఉన్నవారిలోనే ఒక బాలుఁడు వీరుఁడై వెలమలకు ఆవేళ వెన్నుబలము కలిగించెను.

అతఁడు కేవలము బాలుఁడే. యువకుడైనకాఁడు. అంతయుపోగుచేసి అతనికి అప్పటికి పండ్రెండువత్సరములు. దేవరకొండ ప్రభువర్గమునకుచెందినరావుమాదానేనిపుత్రుఁడు అతఁడు. పెదకోమటివేమారెడ్డి చేతులలో చేడ్పడి మరణించి అతని తమ్మతసుకున స్థాపితుఁడైన పినవేదగిరినేనితమ్ముఁడు అతఁడు. అతనిపేరు లింగమనేఁడు. అతఁడే మన ప్రస్తుత కథానాయకుఁడు.

పెదకోమటివేమారెడ్డి పీఁచమణఁచుటకు పరితపించుచున్న దేవరకొండ, రాచకొండ వెలమవీరులకు ఆ పండ్రెండేండ్ల లింగమనేఁడు ప్రధనప్రధానావలంబకుఁడును, ప్రధనప్రధాన ప్రోత్సాహకుఁడును అయ్యెను.

పండ్రెండేండ్లబాలుఁడు ప్రధనప్రధానావలంబకుఁడు, ప్రధనప్రధానప్రోత్సాహకుఁడును!

విశ్వాస్య మగునా ?
కాకేమి ?

వీరకుమారుఁడు కుమారవీరుఁ డగుటలో ఆశ్చర్యకర మైన విషయమెద్దియును లేదు. బాలుఁడని ఒకనిశౌర్యధైర్యాదుల శంకించుట పాడికాదు.

> ధైర్యమ్ము తగ్గునుత్సాహమ్ము లుడుగు
> వయసుమీఱిన వేళ వచ్చునా బలిమి
> కీర్తికైనను నపకీర్తికైన
> బాలురసైనుండు భారమంతయును.
>
> —పల్నాటివీరచరిత్ర

అని లోకజ్ఞుఁడగు కవి గొంతెత్తి పాడుచున్నాఁడు. అల్పాక్షరము కలదైనను మంత్రమునకు మాహాత్మ్యము కొఱవడదు. పిన్నవాని చేతిదివ్వెయైనను పెద్దగనే వెలుగును. బాలసూర్యుఁడైనను తేరిపాఱచూచుటకు దుర్నిరీక్ష్యుఁడే అగును. బాల్యముననైనను కాలసర్పమునకు విషము లేకుండఁబోదు.

కావుటనే పండ్రెండేండ్ల లింగమనేఁడు ప్రధన ప్రధానావలంబకుఁడు, ప్రధనప్రధానప్రోత్సాహకుఁడు అగుట విశ్వాస్యమే యగునని చెప్పనగుచున్నది. ఈవిషయము విశ్వాస్యమే యగునని చరిత్రయు చెప్పుచున్నది.

లింగమనేనివంటి బాలవీరులు లింగమనేనికి పూర్వోత్తరకాలములందు ప్రపంచమునందలి వివిధదేశచరిత్రలలో పరశ్శతములుగా ఉండుట చరిత్రాభిరతులకు కర్ణతాడిత విషయము. ప్రపంచవివిధదేశచరిత్రలలో పరశ్శతములుగానున్న అట్టి బాలవీరుల గాథలన్నియు ఇక్కడఁ దెత్తువ్వట అప్రస్తుతము.

భారత దేశచరిత్రపాఠకుల కందఱకును పరిచితపూర్వులైన బాలవీరుల ముగ్గురి గాథలను మాత్రము ఉదాహరణార్థము పేర్కొనిన చాలును.

అక్బరు పదుమూడేండ్లమూడునెలలవాఁడై యున్నప్పుడు (క్రీస్తుశకము 1556–వ సంవత్సరము) బహరాంఖాను అను సేనానివెంట పంజాబుమీఁదికి ఎత్తివెళ్ళెను. తా నట్లు వెడలినప్పుడు రాజధానిలో తండ్రిహుమాయూన్ మరణింపఁగా అక్బరు వెంటనే మొగలాయిరాజ్యమునకు చక్రవర్తియై పదునెనిమిదేండ్లవాఁ డగునప్పటికి బహురాంఖానుని తొలఁగించి రాజ్యాధికారమంతయు తనచేతికి తీసికొని వ్యవహరింపఁ గలిగెను.

యువకవీరుఁడయిన ఈ యక్బరు ఇరువదినాలుగేండ్ల వయస్సున క్రీస్తుశకము 1567–వ సంవత్సరములో రాజపుత్రస్థానమునందలి చితోడుదుర్గముపై ఎత్తివెళ్లినప్పుడు అతనికి భయపడి రాణా ఉదయసింగు పాఱిపోవగా ఆ దుర్గరక్షణభారమును వహించిన కేళవాధీశుఁడు పట్టా పదునాఱువత్సరముల పడుచువాఁడు. అప్పట్టున పట్టా చేసిన యుద్ధమును చూచి యువకవీరుఁడగు అక్బరుకూడ మిగుల ఆశ్చర్యమును చెంది అతనిని రూపొందిన సంగ్రామదేవత అని పేర్కొనెను.

రసపుత్రచరిత్రకు చెందిన పదునాఱేండ్ల పడుచుపట్టా ఇట్లు దుర్గరక్షణయుద్ధమున వీనుమిగులఁగా మహారాష్ట్ర చరిత్రకు చెందిన పదునాఱేండ్లపడుచువాఁ డొకఁడు శత్రుదుర్గసాధనయుద్ధమున వీనుమిగిలెను. శివాజి పదునాఱుసంవత్సరములవాఁడయి ఉండఁగా (క్రీస్తుశకము 1643–వ సంవత్సరమున) బీజపూరు సుల్తానుకు చెందిన తోరణాకిల్లాను పట్టు

కొని తాను స్థాపించునట్టి మహారాష్ట్రరాజ్యమునకు తొలి తోరణము కట్టెను.

మొగలు, రాజపుత్ర, మహారాష్ట్రచరిత్రలకు చెందిన పై ముమ్మురు బాలవీరులకంటె ఆంధ్రచరిత్రకు చెందిన బాల వీరుఁడు లింగమనేఁడు చిన్నవాఁడు. వారికంటె మాత్రమే కాదు, ఈ గ్రంథమున కీర్తితులగుచున్న ఇతర ఆంధ్రయువక వీరు లందఱికంటెను లింగమనేఁడు పిన్నవాఁడు.

పిన్నవాఁడు కావుననే అతనికీర్తిని గానము చేసిన భట్టు కవులు అతనిని 'కుమారలింగ' అని పేర్కొనిరి; అతని ఖడ్గ పుత్రికకు కదనమె' బొమ్మరిల్లని, వీరజయాంగనామణులె చెలి కత్తెలని, మదకరిమస్తకుంభములె దొంతులని, సంగరస్థలిని గుదికొనివడ్డ రాహుతులక్రొవ్వులె గుజ్జనకూళ్ళని వర్ణించిరి.

లింగమనేని విక్రమోత్సేకమును వెలుగోటివారి వంశ చరిత్ర ఇట్లు వివరించుచున్నది:

"లింగమనేఁడు ద్వాదశవర్షంబులవాఁడై యుండి తన బంధువర్గంబుల హితపరిజనంబులఁ గూర్చుకొని యమరులకు వెక్కసంబగు యుద్ధంబుఁజేసి వేమారెడ్డినిఁగొట్టి తమ్మపడిగానఁ బొదిగించె. వేమారెడ్డి మొదలయిన పంటవారినెల్లఁగొట్టి తమ్మపడిగానఁ బొదిగించిన ఆలింగమనేఁడేసోమకులమురాజులు మొదలయిన రాచవారినెల్లఁగొట్టికాలి పెండానఁ బొదిగించెను. ఆ లింగమనేఁడె యొకనాఁటిధాటిని ముప్పదిరెండు దుర్గములు పుచ్చుకొని యేకధాటీసమర్థవిషమధాటిపాంచాల, చతురు పాయదక్ష, రిపుప్రళయాంతకోపేంద్ర, యష్టదిగ్గాజ మనో భయంకర, యవఘళరాయమాన మర్దన, మేదినీరాయదుష్ట గజాంకుశ, కోటలగొంగ బిరుదులను వహించినవాఁడు."

ఈ నిస్సామాన్యపరాక్రముఁడు పెద్దవాఁడై పొందిన విజయపరంపరలతో మనకు ప్రసక్తిలేదు. యువకుఁడుగా ఆతఁడు కొనిన విజయములే మనకథకు వలయును.

మాదయలింగమనేఁడు పండ్రెండేండ్ల బాలప్రాయమున క్రీస్తుశకము 1420-వ సంవత్సరమున సేనాసమేతుఁడై పెదకోమటివేమారెడ్డిని జయించి అతని సింహతలాటబిరుదును లాగుకొని అతని తల నఱకి తనతమ్మతనుకున తాపించుకొనెను. అంతియెకాదు. లింగమనేఁడు ఆ యుద్ధమున రెడ్ల విజయాంకమగు నందికంతపోతురాజను పేరి కటారినిగూడ కొట్టుకొనిపోయెను.

కొండవీటిరెడ్డిరాజైన పెదకోమటివేమారెడ్డిని జయించెను; కొండవీటిరెడ్డిరాజుల విజయాంకమగు నందికంతపోతురాజుకటారిని కైవస మొనర్చుకొనెను. మాదయ లింగమనేని ధాటి అంతతో ఆగలేదు. ఆతఁడు రాజమహేంద్రవరపురెడ్డిరాజ్యముమీఁదకు కూడ ఎత్తివెళ్ళెను. రాజమహేంద్రవరపురెడ్డిరాజులయిన వేమ, వీరభద్ర, దొడ్డారెడ్లను జయించి వారి రాజధానీనగరమును దోఁచివెట్టెను. ఈదండయాత్రలోఁ అతఁడు సింహాద్రిని, సప్తమాడియములను కూడ జయించెను. విజయలక్ష్మీవిలాసుఁడై అతడు దేవరకొండకు చేరెను.

కొండవీటి రెడ్డిరాజ్యమునకు పెదకోమటివేమారెడ్డి అనంతరము అతనికుమారుఁడు రాచవేమారెడ్డి రాజయ్యెను. కాని అతనికిరాజ్యనిర్వాహము కష్టసాధ్యముగఉండెను. కులక్రమాగతమైన నందికంతపోతురాజుకటారిని కోలుపోవుట రెడ్లకుఅపశకునముగా ఉండెను. తిరిగి దానిని సంపాదించినకాని తమ

కొండవీటిరాజ్యమును నిల్వరించుకొనఁజాలమను అనుమానము రెడ్లకు కలిగెను. లింగమనేనితో యుద్ధముచేసి ఆ కటారిని అప్పట్టున తిరిగి చేజిక్కించుకొనుటకు వారికి పరాక్రమప్రాభవము చాలకుండెను. కాఁగా వారు దానిని సామోపాయమున సంపాదింప సమకట్టిరి.

సుప్రసిద్ధాంధ్రకవి శ్రీనాథుఁడు పెదకోమటివేమారెడ్డి కాలమునుండియు కొండవీటి రెడ్డిరాజ్యమున విద్యాధికార్యున్నతోద్యోగము వహించి ఉండెను. శ్రీనాథునివంటి మహాకవి పోయి అడిగినచో లింగమనేఁడు కటారిని ఈయకపోఁడని రెడ్లు తలఁచిరి. కాఁగా వారు దేవరకొండకు పోయి రావలసినదిగా శ్రీనాథుని కోరిరి.

కదనము చేయఁదగుపనినికవిరాయబారము నెఱవేర్పఁగలదా?

నెఱవేర్చిన ఉదంతములు ఉన్నవి.

క్రీస్తుశకము 1193లో ఈ దేశముమీఁదకుఎత్తివచ్చిన శహాబుద్దీన్ గోరీ స్థానేశ్వరమహాయుద్ధమున ఢిల్లీరాజ్యాధీశ్వరుఁడగు పృథ్వీరాయని జయించి అతని నేత్రద్వయమును పీకించి చెఱఁబెట్టెను. చెఱలోఉన్న పృథ్వీరాయనిపక్షమున అతనిఆస్థానకవిచాంద్ భాట్ గోరీవద్దకురాయబారము వెళ్ళెను. శబ్దపుజాడనుబట్టి శరసంధానముచేయఁగలపృథ్వీరాయనిసామర్థ్యమును గోరీవద్ద పొగడి ఆవిద్యలో అతనిని పరీక్షించుటకు ఒప్పించి ఆపరీక్షవేళపృథ్వీరాయనిచేగోరీనిసంహారింపఁజేసెను.

క్రీస్తుశకము పదమూడవ శతాబ్దిలో నెల్లూరుప్రభువు మనుమసిద్ధిరాజు తనదాయాదులగు అక్కన, బయ్యనలకుఓడి

పాటిపోయెను. అప్పుడు అతని ఆస్థానకవి తిక్కన తనరాజుతర ఫున గణపతి దేవచక్రవర్తివద్దకు రాయబారము వెళ్ళి సేనాసహి తముగ ఆ చక్రవర్తిని తీసుకొనివచ్చి నెల్లూరు రాజ్యమును తిరిగి మనుమసిద్ధికి ఇప్పించెను.

ఢిల్లీప్రభువు పృథ్వీరాయనిపట్ల కవిచాంద్ భాట్ రాయ బారమును, నెల్లూరుప్రభువు మనుమసిద్ధిరాజుపట్ల కవితిక్కన రాయబారమును ఫలించియుండుట లోకజ్ఞుఁడగు శ్రీనాథునకు తెలియును. కాఁగా ఆ కవిగ్రామణి అట్టి రాయబారమునకు వెనువెంటనే ఒప్పుకొలిచ్చెను.

రెడ్డిరాజ్యాభిమానము, ప్రభుభక్తియు ప్రేరేపఁగా శ్రీనాథుఁడు నందికంతపోతురాజుకటారిని కొనితెచ్చుటకయి లింగమనేనివద్దకు దేవరకొండకు ప్రయాణమై వెళ్ళెను.

లింగమనేనికి అది లేజవ్వనపుఁ బొగరుఁప్రాయము. అతఁడు అతిబాల్యమున నేనిస్సామాన్యపరాక్రముఁడుగా పేరొం దిన వెలమవీరుఁడు. అట్టివాఁడు తనకు శౌర్యచాతుర్యసంలబ్ధ మైన నందికంతపోతురాజుకటారిని శ్రీనాథుఁడంతటి ఉద్దండ కవి అడిగినను ఇచ్చివేయుపాటి ఉదారుఁడు కాఁగలఁడా?

లింగమనేఁడు ఎంతటి వీరుఁడో అంతటి సరసుఁడు; ఎం తటి రణవిశారదుఁడో అంతటి విద్యారసికుఁడు. కాఁగా అతఁడు తనదర్శనమునకువచ్చిన శ్రీనాథభట్టసుకవికి స్వాగతోపచార ములుసల్పెను. శౌర్యధైర్యాదిగుణమండితుఁడైన ఆ యువక వీరుని శ్రీనాథమహాకవి ఇట్లు ఆశీర్వాదపూర్వకముగ కొనియాడెను.

సీ. జగనొబ్బగండాంక! సంగ్రామనిశ్శంక!
జయసిద్ధి రాజువేశ్యాభుజంగ!
అఖిలకోటలగొంగ! యరిరాజమదభంగ!
మేలందు ధరణీశమీనజాల!
మూరురాయరగండ! మురియురాజులమిండ
యభివృద్ధి రాయచాహుత్తమల్ల!
ఘనగాయగోవాళ! కామినీపాంచాల!
బ్రహ్మయు శశివంశపరశురామ!
గీ. దండిబిరుదుల సురతాణి గుండెదిగుల!
బళిర! యల్లయవేముని పగరమిండ!
రమణమించిన మేదినీరావుబిరుద!
సంగరాటోప! మాదయలింగభూప!

—చాటుధార

తనప్రత్యర్థిరాజులవద్ద విద్యాధికార్యున్నతపదవిలో ఉన్న శ్రీనాథమహాకవీశ్వరుఁడు వచ్చి జయసిద్ధిరస్తు, అభివృద్ధిరస్తు, బ్రహ్మయురస్తు అని తన్ను ఆశీర్వదించుచు వినుతించుచున్నాఁడు. ఇంతకంటె శూరునకు కోరఁదగిన దేముండును?

లింగమనేఁడు అంతరంగమున ఎంతయో అలరెను. వాంఛితమెట్టిదో తెలుపుఁడని శ్రీనాథుని కోరెను. అగ్రహారమో, కనకాభిషేకమో కోరునని లింగమనేఁడు తలఁచెను. కాని శ్రీనాథుఁడు సొంతమునకు ఏమియు అడుగలేదు. ప్రభుభక్తిపరాయణుఁడై అతఁడు కటారనే కాంక్షించెను.

ఆ కటారి తనకు విక్రమకళాసంలబ్ధమైనది. దానిని తాను విజయప్రశస్తిచిహ్నముగా భద్రపఱచుకొని ఉండెను. అగుఁ

గాక! లింగమనేఁడు కొంచెముకూడ కించపడక ఆ కటారిని శ్రీనాథునకు అలవోకగా ఇచ్చివేసెను.

రెడ్డిసోదరులైన పెదకోమటివేమారెడ్డి, మాచారెడ్డి-వెలమసోదరులైన పినవేదగిరినేఁడు, లింగమనేఁడు ఈ ఉభయ పక్షముల నడచిన యుద్ధములలో లింగమనేఁడు నవయౌవనము నాలుగంచులకు ఎక్కని బాల్యప్రాయముననే అనన్యదురాప మైన విక్రమోత్సేకము, అనన్యసామాన్యమైన పౌరుషము నెఱపెను. అయినను శ్రీనాథుఁడువచ్చి అడుగఁగా వీరయోధుఁడు లింగమనేఁడు విజయదర్పమునంతను వీడి వినయసుందరుఁడై కటారిని అలవోకగా ఇచ్చివేసెను. యుద్ధవీరుఁడు మాత్రమే కాక అతఁడు దానవీరుఁడుకూడ అగుటనే ఇట్లు చేసెను.

ఇట్లు చేసెనుకావుననే కవులు ఆతనిని అక్షరరమ్యముగ ఇట్లు కీర్తించిరి:

ఉ. ఆర్గురు చక్రవర్తులు, పదార్గురు రాజులు దక్క సన్యరా
డ్వర్గము నీసమాన మనవచ్చునె బాహుపరాక్రమక్రియా
భర్గ సమాన! సోమకులభార్గవరామ! కుమారలింగ! స
న్మార్గపరంపరాభిమతమంగళమూర్తి! విశాలకీర్తులన్.

—వెలుగోటివారి వంశావళి

యువకుఁడు లింగమనేఁడు ప్రతాపగరిమతో 'గడ్డపాఱలు గోఁగుకాఁడలవలె మళ్ళువేసిన' దుర్వారదోర్బలముకల కొండవీటిరెడ్లను కదనమున కాకుచేసి రెడ్డిరాజ్యమును ఒడ్డగిలఁబడ చేసెను. తలను కప్పియున్న మావికూడ ఊడని శిశుప్రాయము

నసే దేవతలసేనలకు నాయకుఁడై ప్రౌఢతరరణక్రీడ నెఱపిన కుమారస్వామిని తలపించుచు లింగమనేఁడు పిన్నటనాఁట నే మహాసేనుఁడును, ప్రతాపాభరణుఁడును ఐ రెడ్డిరాజ్యముల రెండింటిని సంక్షోభింపఁజేసి ప్రాగాంధ్రప్రదేశమున తన వీర చందనపుఁదావిని వెదచల్లెను.

శా. వేరీ! ని న్నెదిరింపఁగా జగమునన్ వీరుల్ ప్రతాపోద్ధతిన్
ధౌరంధర్యమునన్ ప్రభావమహిమన్ స్థైర్యంబునన్ జాపలీ
లారంభంబున సాహసిక్యమున బాహాశక్తి దివ్యాయుధో
దారప్రౌఢిమ దేవదైత్యనరగంధర్వాదిసంఘంబులన్.

—హరవిలాసము.

— * —

3

# మన్నారు దేవనాయకుఁడు

శా. దాక్షిణ్య మగణ్య మావితరణం బస్తోక మాన్యాయ మ
ర్యాదాచార మపార మావినయ మార్యామోదసంధాయకం
బాదోర్వీర్య మనార్య మాఘనతనూద్యత్తేజ ముద్వేజమా
ప్రాదుర్భావము మంగళాస్పదము చెప్పన్ శక్యమే యాతనిన్.

—రా మ య క వి

ఆంధ్రభోజుఁడగు కృష్ణదేవరాయల అనంతరము తంజావూరు చోళరాజ్యమును, మధుర పాండ్యరాజ్యమును ఆంధ్రనాయక రాజులు స్వాధీనము చేసికొని జేగీయమానముగా ఏలఁజొచ్చిరి.

మన కథాకాలమునాఁటికి—అనఁగా క్రీస్తుశకము 1673 నాఁటికి—తంజావూరు ఆంధ్రనాయక రాజ్యమునకు విజయరాఘవనాయకుఁడును, మధుర ఆంధ్రనాయక రాజ్యమునకు చొక్కనాథ నాయకుఁడును ప్రభువులై ఉండిరి. ఈ ప్రభువు లిద్దఱిలో విజయరాఘవనాయకుఁడు వయోవృద్ధుఁడు, చొక్కనాథ నాయకుఁడు పిన్నవయసువాఁడు.

తంజావూరి విజయరాఘవనాయకునకు ఒకపుత్రుఁడు; ఒక పుత్రిక.

విజయరాఘవనాయకుఁడు తనపుత్రునకు ఇష్టదైవమగు మన్నారుదేవుని నామము ఉంచెను.

తంజావూరు ఆంధ్రనాయక రాజులది మన్నారుగోత్రము. మన్నారుగోత్రికులైన వారు తంజావూరు వచ్చినపిమ్మట

అచ్చటికి చేరువలోనున్న మన్నారుకోయిల్‌లోని రాజగోపాలస్వామి అను పర్యాయాభిధానము గల మన్నారుస్వామిని తమ కులదైవతముగా చేకొనిరి. విజయరాఘవనాయకుఁడు మన్నారుస్వామి ప్రసాదముచే పుట్టుటవలన అతనికి 'మన్నారుదాసు' అను బిరుదముకూడ కలిగినది. తెలుఁగునాయకుల ఇట్టి విశేషసంబంధమువలన మన్నార్‌కోయిల్ అను ద్రవిడనామము మన్నారుగుడి అను తెనుఁగు నామముగా మాఱినది. తమిళదేశమున రాజత్వము నెఱపిన ఆంధ్రనాయక రాజసంబంధము గల ఈ మన్నార్‌కోయిల్‌కు రాజమన్నార్‌కోయిల్ అనియు, మఱియొక మన్నార్‌కోయిల్‌కు కాటుమన్నార్‌కోయిల్ అనియు వ్యవహారనామములు ఏర్పడినవి.

మన్నార్‌కోయిల్‌కు రాజశబ్దము ఉపసర్గగా చేరుటకును, తమిళవాసన పెచ్చురిల్లు మన్నార్‌కోయిల్ అను నామము వెనుకబడి తెనుఁగువాసన గుమ్ముగ గుబాళించు మన్నారుగుడి అను నామము విశేషప్రచార మందుటకును కారణభూతులైన ఆంధ్రనాయక రాజవంశమున పుట్టినవాఁడును, మన్నారుగోత్రోద్భవుఁడును; మన్నారుస్వామి ప్రసాదమువలన ప్రభవించి మన్నారుదాసుఁ డను ప్రసిద్ధి వహించినవాఁడును అగు విజయరాఘవనాయకుఁడు తన ఏక పుత్రునకు మన్నారుదేవనాయకుఁడను పేరు పెట్టెను.

మన్నారుదేవనాయకుఁడు ఈకథాకాలమునాఁటికి వివాహితుఁడై, పుత్రవంతుఁడై ఉండెను. మన్నారుదేవుని పుత్రుని నామము చెంగమలదాసు. చెంగమలదాసు అప్పటికి నాలు

గేండ్ల బాలుఁడు. నాలుగేండ్ల బాలుని తండ్రియైన మన్నారు దేవుఁడు అప్పటికి పాతికయేండ్లకు పైఁబడినవాఁడై ఉండును.

మన్నారుదేవనాయకుఁడు పితృభక్తిలో రామసమానుఁడు. ధైర్యసాహసములలో కుమారస్వామిసదృశుఁడు. యుద్ధవిద్యలో అభిమన్యునితో ఉపమింపఁదగినవాఁడు. అతులితాశ్చర్యతపశ్చర్యుఁడగు శతక్రతుశ్రీనివాస తాతాచార్యుల శిష్యుఁడు. అతులకనకతులాప్రముఖనిఖిల మహాదానములు చేసినవాఁడు. అనేకాగ్రహారప్రతిష్ఠాపన ప్రవీణుఁడు. విశేషించి సాహితీసంపన్నుఁడు. అప్పటికే అతఁడు తెనుఁగున విజయరాఘవాభ్యుదయ మను ప్రబంధమును, హేమాబ్జనాయికాస్వయంవర మను నాటకమును రచియించి ఉండెను.

ఇట్లు మహితప్రభావుఁడై ఉండిన మన్నారుదేవనాయకుని మీఁద ఎందులకో విజయరాఘవనాయకునికి కోపమువచ్చినది. కాఁగా అతఁడు మన్నారుదేవుని చెఱసాలయం దుంచెను.

కొడుకు కావున ఈ బంధితునిపట్ల విజయరాఘవనాయకుఁడు కృపావిశేషము చూపెను. బద్ధుని చేతికి ఇప్పట్టున ఇనుప బేడీలు కాక బంగారుసంకెళ్లు వేయించెను. 'సంకెళ్లు' అన్నప్పుడు అవి ఇనుముతో చేసినవైనను, బంగారముతో చేసినవైనను ఒక్కటేఅను దృష్టి విజయరాఘవనాయకునకు కలిగినది కాదు.

పరికింపఁగా విజయరాఘవనాయకుఁడు శీఘ్రకోపిగా, చలపాదిగా కనిపించుచున్నాఁడు.

శీఘ్రకోపికావుననే అతఁడు చెప్పుడుమాటలు విని కడుపార కన్నకొడుకును మన్నారుదేవు పేరిటివానిని కారాగారమున ఉంచెను.

చలపాదికావుననే అతఁడు వరయోగ్యుఁడైయున్న తన కూఁతునకు తోడి నాయకరాజగు మధుర చొక్కనాథనాయకునినుండి మనువుమాటలు రాఁగా మారుపథమున నడచెను.

ఆ మనువు తనకు నచ్చనిచో ఆ సంగతి అతఁడు మర్యాదగ, మార్దవముగ చెప్పవలసినది. కాని అతఁడు అట్లుచేయలేదు. సందేశహరులు తెచ్చిన వివాహమంగళసందేశమును స్వీకరింపకపోవుటయే కాక వారు కొనివచ్చిన భేటివస్తువులనయినను అతఁడు స్వీకరింపలేదు. పైఁగా ఆ వచ్చినవారిని వెంటనే కోటబయటకు పంపించివేయ తనసేవకులకు ఆజ్ఞాపించెను. కోటబయటనైనను ఆసందేశహరులకు బత్తెము భరణము విచారించు ఏర్పాటులు చేయలేదు.

ఈవిధమున అవమానమును పొంది వారు పోయి రాజాచొక్కనాథనాయకునితో నడచిన వృత్తాంతము చెప్పిరి.

తోడి సంస్థానికుఁడనగు నేను అడుగఁబోఁగా అతఁడిట్లు అవమానముచేయునా అని చొక్కనాథనాయకుఁడు మండిపడి తన దళవాయి వేంకటకృష్ణప్పనాయని పిలిచి దండు కూర్చుకొని పోయి తంజావూరుకోటను ముట్టడింపుమనెను. ప్రభుని ఆజ్ఞ తలనిడుకొని వేంకటకృష్ణప్పనాయఁడు తంజావూరుకోటను ముట్టడించెను.

తంజనగరముసేనాని రంగప్పనాయఁడు వేంకటకృష్ణప్పనాయని ఎదుర్కొని యుద్ధము చేయసాగెను. తంజావూరికోటలో విశేషసైన్యము – ఇరువదివేలకు పైఁగా–ఉండెను.

అందుకు మధురవారు ఎంతమాత్రము జంకక దండు పురిగొలిపి ఫిరంగులు మోర్చాలపై ఎత్తించి కోటపైని ఉన్న

సైన్యముమీఁద లక్ష్యముంచి ప్రేల్చసాగిరి. మధురవారు ఇరువదివేలగుండ్లకు పైఁగా ప్రేల్చిరి. ఎడతెగని గుండుదెబ్బలకు ఆఁగలేక తంజావూరుసేనలు విఱిగిపోవఁదొడంగెను.

ఈలోఁగా మధురవారు అగడ్తను కొయ్యపలకలచేత మూయించిరి. ఇఱిసిపడినత్రోవలవెంట కొందఱు, వాకిళ్లవెంట కొందఱు మధురసైనికులు కోటలో ప్రవేశింప నారంభించిరి. కొంచెముకొంచెముగా తంజాపురికోట శత్రువుల స్వాధీనము కాఁజొచ్చెను.

ఆ విపత్కరసమయమున తంజావూరిదళవాయి రంగప్పనాయకుఁడు విజయరాఘవనాయకునిచెంత కేఁగి చెఱసాలనుండి మన్నారుదేవనాయకుని విడిపించి రప్పించి ముందుకర్తవ్యము ఆలోచింపవలసిఉన్నదని చెప్పెను. విజయరాఘవనాయకుఁడు అందుకు సమ్మతించెను.

తక్షణమే తగుమనుష్యులు పోయి బందిఖానా తెఱచి మన్నారుదేవుని బంగారుసంకెళ్ళు విడిపించి తమ పితృదేవులు పిలుచుచున్నారని చెప్పిరి.

తన్ను చెఱయందుంచినను తండ్రిపై అతనికి ఎట్టి కోపముకాని లేకుండినది. పితృభక్తిని అతఁడు రాముననంతటివాఁడు. తాను అతులితపితృభక్తిగురుభక్తిభాగధేయుఁడనని తన రచనమైన హేమాబ్జనాయికాస్వయంవర నాటకములోని భరతవాక్యమున అతఁడు వాకొనెను.

పిలుపునందుకొని మన్నారుదేవనాయకుఁడుతండ్రివద్దకు వచ్చెను. కవికావున అతఁడు తండ్రినిఉద్దేశించిఅత్యాశువుగా

క. మణి క్రిందుపఱచి జలనిధి
తృణమున్ పైనుంచె నతనిదే కొదవసుమీ
మణి మణియె తృణము తృణమే
రణవిజయదిలీప! విజయరాఘవభూపా!

అను పద్యమును చెప్పెను; సర్వాంగాలింగితమహీతలమగు నమస్కారము చేసెను; లేచి చేతులు మోడ్చి నిలిచెను. ఏలిన వారి సెలవు ఏమిఅని వినయవిహ్వలతతో అడిగెను.

'అల్పమానవుల మాటలు విని నీవంటి కుమారుని ఖైదు చేసితిమి' అని విజయరాఘవనాయకుఁడు మిక్కిలి విచారించెను. అప్పుడుమన్నారు దేవనాయకుఁడు 'గతమునుగుఱించి ఇఁక విచారింపకుఁడు. ముందు జరగవలసిన పనినిగుఱించి ఆజ్ఞ దయచేయుఁడు' అని అర్థించెను.

అందుమీఁద విజయరాఘవనాయకుఁడు కుమారునితో ఇట్లు చెప్పెను: 'ఎదిరిదళము మనఎదుటనే కోటలో ప్రవేశించుచున్నది. ఇఁక మనకు జయాశ లేదు. నేఁటికి మనము ప్రాణములు విడుచుటయే న్యాయము. మనము మరణించినపిమ్మట మహాలులోనివారు ఉంశీన మధురవారు మనచిన్నదానిని తీసుకొనిపోయి మనువువిషయమున తమమాట చెల్లించుకొందురు. రాజ్యము పోయినను, ప్రాణములు పోయినను మనము వారు పట్టినపట్టు చెల్లనీయరాదు. మన పౌరుషము నిలుపుకొనవలెను. కాఁబట్టి మహాలులోనివారిని అందఱను మనమే లయము పొందించవలయును. మహాలులోనికి పోయి ఈకార్యము నెఱవేర్పవలసిన భారము నీమీఁద ఉన్నది. అవసరమగుచో అక్కిరాజునుకూడ వెంటఁబెట్టుకొని పొమ్ము.'

అవిలంఘనీయమగు తండ్రిఆజ్ఞ ఒకవంక, వీరుని ప్రథమ ధర్మమగు రాణివాసపుస్త్రీల మానసంరక్షణము ఒకవంక తనను ఎచ్చరింపఁగా మన్నారుదేవనాయకుఁడుఅక్కిరాజుతో అంతిపురమునకు దారితీసెను.

ఎదిరిదళమువారు కోటచొచ్చినారనివినఁగానే అక్కడ రాణివాసము అంతయు ఒకచోట చేరెను. ఆమీఁద ఆస్త్రీలు మందుకుండలు తెప్పించి చుట్టును పేర్చి పెట్టుకొని కత్తులు, జముదాళ్ళు దూసికొని కూర్చుండి ఏలినవారిఆజ్ఞ ఎప్పుడుఏమి వచ్చునో అని యెదురుచూచుచుండిరి.

మన్నారుదేవనాయకుఁడును, అక్కిరాజును అక్కడకు చేరుటతోడనే ఆ రాజస్త్రీలు 'ఏలినవారికి క్షేమమా? మాకు ఏమి ఉత్తరువు ఇచ్చిరి?' అని అడిగిరి.

మన్నారుదేవనాయకుఁడు తాము వచ్చినపని వారికి చెప్పెను.

తక్షణమే వారు ఒకరినొకరు కత్తులచేతను, కటారుల చేతను నఱుకుకొన ప్రారంభించిరి.

ఇంతలో మన్నారుదేవుఁడు మందుకుండలకు నిప్పు ముట్టించెను. రెప్పపాటులో అగ్నిజ్వాలలు ఛటచ్ఛటాయమానమై నగరంతయు ఆక్రమించి ఆనగరిలో ఆఁడుపురుగు లేకుండ దగ్ధముచేసెను.

నాయకరాజవంశాంకురమును, నాలుగేండ్లబాలుఁడును, మన్నారుదేవుని పుత్రుఁడును అగు చెంగమలదాసును తీసికొని తప్పించుకొనిపోయిన దాదితప్ప మిగతస్త్రీలందఱునుఆనాఁడు అక్కడ అట్లు సంఘమరణమును పొందిరి.

అంతిపురమునుండి లేచి ఆకాశమంటుచున్న అగ్నిజ్వాలలను విజయరాఘవనాయకుఁడు చూచెను. అప్పుడు ఆతఁడు మన్నారుగుడిలోని రాజగోపాలస్వామికోవెలదిక్కుగా తిరిగి మనస్సున ఎంతమాత్రమును ఖేదము చేరనీయక 'మన్నారు దేవా! ఇదిఅంతయు నీకే అర్పితము. రాజగోపాలా! ఇది అంతయు నీకల్పితము' అనుచు రెండుచేతులయందును అతి తీక్ష్ణములై మెఱుఁగులువాఱుచున్న కత్తులనుజళిపించుచు తిరిగి యుద్ధకార్యనిమగ్నుఁడయ్యెను.

అంతిపురమున అంతయు కడతేర్చి ఇంతలో అక్కడికి మన్నారుదేవనాయకుఁడును, అక్కిరాజును వచ్చిరి. అప్పుడు విజయరాఘవనాయకునివద్ద హాజరుగా నమ్మినబంటులు నలుగురుమాత్రమే ఉండిరి. దళవాయి రంగప్పనాయఁడు, పట్టపు ఏనుఁగువాఁడయిన తిమ్మామావటీఁడు, చొక్కరౌతు,వీరబాణము చిన్నరాజు అను నలుగురుమాత్రమే ఉండిరి. వచ్చిన మన్నారుదేవునితో అక్కిరాజుతో వారు ఆఱుగురు ఐనారు.

అప్పుడు దొరలను నడుమ నిలిపి మిగిలిన ఐదుగురును ఐదుకత్తులు తీసికొని ఐదుపక్కల చొచ్చి చేతికి అందినవారి నెల్లరను చెనకి చెండి తుదకు మరణించిరి.

అంతట మన్నారుదేవనాయకుఁడుతండ్రిముందునకువచ్చి శత్రువులను చెనకెను. అదిచూచి విజయరాఘవనాయకుఁడు కుమారునిచేయి పట్టుకొని వెనుకకు లాగుచు ఇట్లు చెప్పెను:

"కుమారా! ఇప్పుడు మన ఇద్దఱకును మరణము ఆసన్నమయినది. నీవు ముందుగా నడుచుచున్నావు. నాకనుల ఎదుట నీవు ఎదిరిచేతులలో మరణించినచో నాకు పుత్రశో

కము. ఈ కడుపుకోఁతకు కనులలో జలము రాకమానదు. యుద్ధరంగమున కళ్ళలో నీళ్ళు కనిపించిన పరలోకహాని. కనుక నీవు నా వెనుక నిలువుము. నాపని అయినతరువాత నీకు పోలినట్టుగా సమరము సవదరింపుము.''

దానికి సమాధానముగా వినయవిహ్వలితో మన్నారుదేవనాయకుఁడు పితృదేవునకు ఇట్లు విన్నపము చేసెను:

''తమరు సర్వజ్ఞమూర్తులును, సకలధర్మములు తెలిసినవారును ఐయుండియు నన్ను వెనుకకుపొమ్మనుట న్యాయమా? మీరు తండ్రులు, నేను కుమారుడను. మీరు రాజులు, నేను బంటును. మీరు సేనానులు, నేను సైనికుఁడను. నన్ను కని పెంచిన మీ ఋణము తీర్చుకొనుటకును, మీ కుమారుఁడను అను పేరునకు తక్కువపాటు రాకుండ నడుచుకొనుటకును, సేనానిని ముందుకు గెంటి సైనికుఁడు వెనుకంజవైచినాఁడను అప్రతిష్ఠ నాకు కలుగకుండ చూచుకొనుటకును ఇది తరుణము. కనుక ఇఁక మీరు నాకు అభ్యంతరము చెప్పవలదని మనవి.''

ఇట్లు అనుచునే మన్నారుదేవనాయకుఁడు కత్తిదూసి గుప్పున యెదిరిసైన్యమున చొఱఁబాఱెను. అతఁడు సాము సాదనలు చేసినవాఁడు. కావున చేతడాలువాలు లేకపోయినను ఎదిరిసైనికులు చుట్టుకొని కత్తులచేత నఱుకు నఱుకఁళ్ళను; ఈటెలచేతను, బల్లెములచేతను పొడిచెడి పోట్లను తప్పించుకొనువాఁడు. ఎదిరినఱుకుళ్లు, పోట్లు సాధనలాఘవముల చేత తప్పించుకొనుచు చొఱఁబాఱి అనేక సైనికులను ఛేదించుచు అతఁడు మధురదళవాయి వేంకటకృష్ణప్పనాయనిమీఁదికి పోయెను.

వేంకటకృష్ణప్పనాయఁడు పలుజగడములలో జయములను పొంది 'సంగరకిరీటి', 'సవ్యసాచి' అను కితాబులుపొందినవాఁడు. అతనికి తనతో సమవీరుఁడైన మన్నారుదేవునితో ద్వంద్వయుద్ధముచేయవలయుననిబుద్ధిపుట్టినది. తోడనే అతఁడు తనదళములో ఎవ్వరినికాని మన్నారుదేవునిమీఁదకుపోవలదని ఆజ్ఞాపించి తాను పట్టెము, కేడెము తీసికొని ఎదిరించెను. సంకీర్ణసమరమధ్యమున అది ద్వంద్వయుద్ధము.

వేంకటకృష్ణప్పనాయఁడు, మన్నారుదేవనాయకుఁడు ఇరువురును సాముసాదనలు చేసినవారు. ఆ సమవీరులు యుద్ధమునకు తలపడుట కర్ణార్జునులు యుద్ధమునకు తలపడినట్లుండెను.

వేంకటకృష్ణప్పనాయఁడు నఱుకు నఱుకుడును మన్నారుదేవనాయకుఁడు తప్పించుకొనువాఁడు. మన్నారుదేవనాయకుఁడు నఱుకు నఱుకుడును వేంకటకృష్ణప్పనాయఁడు తప్పించుకొనువాఁడు. ఈరీతిగా సమరము చాలసేపు సాగినది.

అంతట మన్నారుదేవనాయకుఁడుసాహసోద్రేకముతో పైకి చెంగలించి తనచేతి ఫరంగుకత్తితో దళవాయి వేంకటకృష్ణప్పనాయని శిరస్సు నఱుకఁబోయెను. వేంకటకృష్ణప్పనాయఁడు తన కరమునందలి ఖేటకముతో ఆ నఱకుడును అడ్డుకొనెను. అరకత్తి ఖేటకముమీఁదను, అరకత్తి దళవాయితలమీఁది తలపాగయోరను తగిలి అసిగాయముమాత్రముఐనది.

చిన్నగాయమైనను నెత్తురు చిమ్మకమానదుకదా! నెత్తురు కనిపించుటతోడనేవేంకటకృష్ణప్పనాయఁడు ఆగ్రహోదగ్రుఁడై ఇఁక నాసాహసము చూడుము అని గద్దించి పట్టా

కత్తితో మన్నారుదేవనాయకునిపై తన బలముకొలది దెబ్బ వేసెను.

మన్నారుదేవుని చేత కేడెము లేదు. చేతికత్తితో ఆ దెబ్బను అడ్డగించుటకు అనువుపడలేదు. కాఁగా అతని కుడి ముంజేయి తెగినది. ఇఁక ఆ చేతితోఁ కత్తి పట్టఁగూడక పోయెను. అప్పుడు మన్నారుదేవుఁడు ఎడమచేత కత్తి తీసి కొని వేంకట కృష్ణప్పనాయని కొట్టెను.

కృష్ణప్పనాయఁడు తన చేతి కేడెముచేత దెబ్బ తప్పించు కొనెను. ఎంత తప్పించుకొనినను అతని ఎడమచేతికి కొంచెము గాయము తగిలియే తీరినది.

తగిలిన ఈగాయముతో వేంకటకృష్ణప్పనాయనికి తగని కోపము వచ్చినది. కరమున పట్టాకత్తిని సవదరించుకొని ఊఁచిఊఁచి మన్నారుదేవుని కంఠము గుఱిచూచి అతఁడు తన బలముకొలఁది వేసెను. ఈదెబ్బతో మన్నారుదేవుని మెడ తెగి తలవేఱు, మొండెమువేఱు ఐనది. అతఁడు నేలకూలెను.

విజయరాఘవనాయకుఁడు ఇదిచూచెను. అతనికి క్లేశము, క్రోధము అగ్గలముగా కలిగినవి. మన్నారుదేవుని మరణమునకు క్లేశము. మధురదళవాయిమచ్చరమునకు క్రోధము. యుద్ధరంగ మునకు ఉచితముకాని క్లేశమును ఆతఁడు దిగఁద్రావెను. యుద్ధ రంగమునకు ఉచితమైన క్రోధమును ఆతఁడు ఎసకొల్పెను.

అతితీక్ష్ణములై మెఱుఁగులుపాఱుచుండు కత్తులు రెండు చేతులతో చెఱియొకటి దూసికొని గద్దించుచు అతఁడు ముందు నకు దుమికెను. అప్పుడు దళవాయి వేంకటకృష్ణప్పనాయఁడును తర సైనికులును వచ్చి విజయరాఘవనాయకుని చుట్టుముట్టిరి.

అప్పుడు విజయరాఘవనాయకుఁడు మధురదళవాయితో తుదిమాటగా ఇట్లు చెప్పెను: "కత్తులయుద్ధము, బల్లెముల యుద్ధము మాత్రమేకాని తుపాకులయుద్ధము బొత్తిగ వలదని మీవారికి ఆజ్ఞాపింపుము. తుపాకులు ప్రేల్చుచో దూరమున నుండి తప్పుగుండు వచ్చి తాఁకుటవలన చచ్చిన అది ఆయుధ మరణము కాఁజాలదు. ఆయుధమరణము కాకుండినచో పర లోక హాని. సేనానివైన నీకు ఇది తెలియనివిషయము కాదు."

మధురదళవాయి ఈమాటలువినెను. వానిఔచిత్యమును గురుతించెను. తుపాకులవారిని దూరముగ తొలగిపొమ్మని చెప్పెను. కత్తులవారినిమాత్రము చుట్టుకొమ్మని దిట్టపఱచెను.

కత్తులయుద్ధము ప్రారంభమైనది. మహావీరుఁడగు విజ యరాఘవనాయకుని కత్తులనఱుకుల్లతో పలువురుపడిరి. అంత పక్కనున్నవారు పట్టరానికోపమున ఒక్కపెట్టున కత్తులతో తన్ననునట్లుగా విజయరాఘవనాయకుని నఱకిరి. 'రంగనాథ! రాజగోపాల!' అని ఇష్టదైవస్మరణచేయుచు విజయరాఘవ నాయకుఁడు నేలకొఱగి వీరస్వర్గ మలంకరించెను.

శీఘ్రకోపి, చలపాది ఐనను విజయరాఘవనాయకుఁడు మహావీరుఁడు. ఒకనాఁడేఐదాఱుయోజనముల మేర దాడి వెడలి తిరిగివచ్చు దండితనము, ఒక గుఱ్ఱముపైనుండి మఱియొక గుఱ్ఱముపైకి లఘించునట్టి లాఘవము, మావంతుని ఎదిరించి మదహస్తిపైకి ఎగిరి దానిని అదలించు అవఘళము, ఎంతటి శూరునిఐనను అలవోకగ ఎదిరించి వానిమర్మములు నాటునట్లు సూటిగా సానాకత్తి మీటు చాకచక్యము అగ్గలముగ కలిగి నాఁటివీరులలో అతఁడు మేటియై నెగడెను.

అట్టి మహావీరునిచే ఆహా అనిపించుకొనినవాఁడు మన కథానాయకుఁడు మన్నారు దేవనాయకుఁడు. కారాగారము నుండి కదనరంగమునకు, కదనరంగమునుండి వీరస్వర్గమునకు అతఁడు వీరునివలె వెడలెను.

పితృవాక్యపరిపాలనమున అతఁడు శ్రీరామునితో, పరశు రామునితో పోల్పఁదగినవాఁడు. పితృవాక్యపరిపాలనమునకై శ్రీరాముఁడు వనవాసమును స్వీకరించినట్లే మన్నారు దేవుఁడు కారాగారవాసమును చేకొనెను. పితృవాక్యపరిపాలనమునకై పరశురాముఁడు జననిని వధించినట్లే మన్నారు దేవుఁడు జనా నాను మట్టుపెట్టెను.

శౌర్యమున మన్నారు దేవనాయకుఁడు కర్ణునితో పోల్పఁ దగినవాఁడు. అర్జునుని ప్రతాపమువలన కాక యితర కారణముల చేత కర్ణుఁడు ఓడినట్లే వేంకటకృష్ణప్పనాయని ప్రతాపమువలన కాక ఇతర కారణములచేత మన్నారు దేవుఁడు ఓడినాఁడనవల యును. కర్ణునిపట్ల రథము భూమిలో కూరుకొనిపోవుట ఎట్టిదో మన్నారు దేవునిపట్ల కరమున కేడెము లేకపోవుట అట్టిదని చెప్పవచ్చును.

యువకవీరుఁడై నందుకు అతఁడు పురోగమించి యుద్ధ భూమియందున్న యోద్ధ,వృద్ధజనకరక్షణకై కరము లున్నంత వఱకు కృపాణము పట్టినాఁడు ; ప్రాణము లున్నంతవఱకు రణము సలిపినాఁడు.

---

౪

# చిన్న పద్మనాభుఁడు

అత్యంత ప్రాచీనకాలమునుండియు భారతీయప్రభువులు రథ గజతురగపదాతు లను చతురంగబలసమేతులై ఉండిరి. ఈ చతురంగబలములలో పదాతిబలమునకే వారు ప్రాయికముగ ఎక్కువ ప్రాముఖ్యమును ఇచ్చిరి.

పదాతిబలమునకు ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చుటచే వారికి నరపతు లను వ్యవహారనామము ఏర్పడెను.

మధ్యయుగమున అరేబియా, పారశీకాది దేశములనుండి ఈ దేశముమీఁదికి ఎత్తివచ్చిన ముసల్మానులు తమతమ దేశము లందు అశ్వములు విరివిగ దొరకునవి అగుట అశ్వబలమునకు ఎక్కువ ప్రాముఖ్యమును ఇచ్చిరి.

అశ్వబలమునకు ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చుటచే వారికి అశ్వపతులు అను వ్యవహారనామము ఏర్పడెను.

నరపతులవర్గమునకు చెందియు అశ్వారోహణ విద్య యందు అతిశయ ప్రజ్ఞా ప్రాభవములు చూపి అశ్వపతులవర్గ మునకు చెందినవానిచే మెప్పుల నందిన మేటియువకుఁడు ఒకఁడు ఆంధ్రజాతియందు అలరెను.

అతఁడే మన ప్రస్తుతకథానాయకుఁడైన చిన్నపద్మ నాభుఁడు.

## చిన్నపద్మనాభుఁడు

చటులబాహాబలోత్పారితదుర్విప
క్ష కదంబకము వారు కమ్మవారు

అని ఉచితజ్ఞులగు కవులచే కీర్తింపఁబడిన కమ్మకులమున పుట్టెను.

వాసిగాంచిన కమ్మకులమునఁబుట్టి పెదవేమారెడ్డి సేనాపతులలో ఒకఁడై ఆ వేమారెడ్డిమీఁద తిరుగఁబడ్డ పశ్చిమాధిపుల ఎనమండ్రను తాను ఒక్కరుఁడే జయించి మహారాజు అను వాసి రెడ్డికి నిలిపిన సదాశివనాయని తరమునసుఁడి ఆ వంశమువారికి వాసిరెడ్డివా రను పౌరుషనామము కలిగెను. అనంతరము ఆవంశమున అవార్యశౌర్యచర్యలకు పేరుకెక్కిన వీరులు ఎందఱో పుట్టిరి. కావుననే కవులు వాసిరెడ్డివంశమును

గాఢశౌర్యాగ్న్యంశుకాశికీభూత దు
ర్విమతవీరులు వాసిరెడ్డివారు

అని కీర్తించుచువచ్చిరి. అట్టి విఖ్యాతవంశమున మన చిన్నపద్మనాభుఁడు పుట్టువునొందెను.

వీరనరుఁడైన సదాశివనాయనివంశము వాసిరెడ్డివంశము ఐన తరువాత ఆవంశమునకు వన్నెయువాసియు కూర్చిన మూలపురుషుఁడు వీరప్పనాయుఁడు. వీరప్పనాయని నందిగామపరగణాకు దేశముఖునిగా నియమించుచు క్రీస్తుశకము 1670-వ సంవత్సరమున గోలకొండనవాబు సనదు నిచ్చెను. నందిగామ పరగణాకు దేశముఖుగా అతఁడు పదునాఱువత్సరములు పరిపాలన సాగించి 1686-వ సంవత్సరమున మరణించెను.

వీరప్పనాయనికి కుమారులు ముగ్గురు. వారు ముగ్గురును నందిగామపరగణాను మూఁడుభాగములుగ పంచుకొనిరి.

ఎవరి భాగప్రదేశమున వారు కోటలు నిర్మించుకొని విడివిడిగా పరిపాలన ప్రారంభించిరి.

ఆ ముప్పురుసోదరులలో పెద్దవాఁడు రాఘవయ్య. అతనిది మాగల్లుకోట. రెండవవాఁడు రామన్న. రాఘవపురము అతని రాజధాని. మూడవవాఁడు చంద్రమౌళి. అతఁడు ముక్తీల దుర్గాధిపతి.

ఇందు రాఘవపుర దుర్గపాలకుఁడైన రామన్న మూడవ కుమారుఁడు చిన్నపద్మనాభుఁడు. మాగంటిదుర్గాధీశ్వరుఁడైన రాఘవయ్యకుమారుని నామముకూడ పద్మనాభుఁడే. అతఁడు రామన్నకుమారుఁడైన పద్మనాభునికంటె పెద్దవాఁడగుట పెద్ద పద్మనాభుఁ డను వ్యవహారనామము నందెను. మనకథానాయకుఁడును, రామన్నకుమారుఁడును ఐన పద్మనాభుఁడు చిన్న పద్మనాభుఁడు అను వ్యవహారనామము నందెను.

రాఘవయ్య, రామన్న, చంద్రమౌళి తమతమజమీలను ప్రత్యేకము ఏలుటకు ప్రారంభించి ఏఁడాది తిరిగిరాకపూర్వమే 1687-వ వత్సరమున గోలకొండరాజ్యమును ఢిల్లీ మొగలాయి చక్రవర్తి ఔరంగజీబు స్వాధీనముచేసికొనెను. రాజ్యాంగము చేతులుమారిన ఆ సందర్భమున సోదరులు ముప్పురును తమ దేశముఖు సనదును తిరిగి ఖాయముచేసికొనవలసివచ్చెను.

ఈ సందర్భమైన కార్యకలాపనిర్వహణమునకై సోదరులు ముప్పురును ఢిల్లీకి పయనమైరి. ఈ ప్రయాణముసంగతి వీరయువకుఁడైన చిన్నపద్మనాభునిచెవిని పడినది. యౌవనోద్వేగము, వీరోత్సాహము, ప్రాభవోద్యోగము ప్రేరేఁపఁగా

అతఁడు తండ్రితో, పెదతండ్రితో, పినతండ్రితో ఢిల్లీకి పయనమయ్యెను.

వా రందఱును ఢిల్లీకి పోయిరి. అక్కడ పాదుషహా దర్శనము చేసిరి. అన్నదమ్ములు ముప్వురును ఆత్మవిక్రమ క్రియా రచనచే అతనిని సంతోషపఱచిరి.

ముదితుఁడై పాదుషహా వారికి నందిగామసీమకెల్లను సుస్థిరపు జమీందారి మిరాశీ ఇచ్చెను. మన్నెచౌదరి, రాజ బహాదరు, దేశాయి, సర్ దేశముఖి మున్నగు బిరుదులు ఇచ్చెను.

మిరాశీ ఇచ్చి, బిరుదులు ఇచ్చి పాదుషహా వారిని గౌర వించెను. కాని ఏలనో వారియందు అతనికి నమ్మకము పూర్తిగ కుదురలేదు. కాఁగా వీరయువకుఁడైన చిన్నపద్మనాభుని తన వద్ద పూఁటగా ఉంచుమనెను. అతనిని అక్లే ఉంచి సోదరులు ముప్వురు సంస్థానములకు తిరిగివచ్చిరి.

సంధిషరతులు నెరవేర్చువఱకు ఢిల్లీలో తాఁకట్టుగా ఈయఁబడిన చిన్నపద్మనాభుఁడు అప్పటికి ప్రాజ్ఞుఁడైన యువ కుఁడేకాక సాముగరడీలు నేర్చిన ఆజానుబాహుఁడగు దృఢకా యుఁడు; అశ్వవిద్యయందు అనంతకౌశలము గడించిన సాది కూడ ఐఉండెను.

రాఘవపురము జమీనుచెంత గల రేగంటిపాలెపు అగ్రహారము మున్నగుతావులందు వజ్రపుగనులు ఉండెను. ఢిల్లీకి పోవుచు ఎందుకైన మంచిదని ఆ గనులలోనుండి తీసిన వజ్రములను కొన్నిఁటిని చిన్నపద్మనాభుఁడు నడుముకట్టులో భద్రపఱచుకొనెను.

చిన్నపద్మనాభుఁడు ఢిల్లీలో తాఁకట్టుపడి బహువారములైనది. కుదువగా ఉండిన అతనికి ఆవాహనముకాని, విసర్జనము కాని లేకుండినది. ఎట్టి విచారణకాని లేకుండ అతఁడు అట్లే బహుదినములు పడియుండెను.

ఒకనాఁడు అతఁడు తన మందిరమువాకిట నిలిచి కురులు దువ్వుకొనుచుండెను. అంతిపురపు గవాక్షమునుండి అప్పుడు ఒక బేగము అతనిని పరికించుట తటస్థించెను.

అతని ఆజానుబాహువిగ్రహము, వ్యాయామసుస్నిగ్ధకాయము, కుటిలదీర్ఘకుంతలములు, సుభగత్వము ఆమెను ఆకర్షించినవి. కాఁగా అతని విషయము విచారించి ఆమె ఆ సంగతులు చక్రవర్తిజ్ఞప్తికి తెచ్చినది. ఈ సమాచారము తెలిసికొని చిన్నపద్మనాభుఁడు తాను తెచ్చిన వజ్రములను ఒక జాకెట్టుమీఁద బుటేదారిపనితో పొదిగి ఆమెకు కానుకగా పంపెను.

వజ్రములతో బుట్టాలువేసి తయారుచేసిన ఆ జాకెట్టు పనితనమునకు, విలువకు ఆబేగము ముదితురాలై చిన్నపద్మనాభుని విడుదలకు విశేషప్రయత్నము చేసినది.

బేగము సిఫారసును పాదుషహా చెవినిపెట్టెను. బేగముమనస్సును కష్టపెట్టుటకు కాని, చిన్నపద్మనాభుని విడిచిపెట్టుటకు కాని పాదుషహాకు ఇష్టములేకపోయినది. కాఁగా ఆతఁడు బేగము చనువును చెల్లించుచున్నట్లు కనిపించుచునే చిన్నపద్మనాభుని అంతమొందింపఁగల ఒకపనిని తలపెట్టెను.

మొగలాయి చక్రవర్తివద్ద ఒక పెంకెగుఱ్ఱము ఉండినది. పేరుమోసిన రేవంతులుకాని, రాహుత్తులుకాని అంతవఱకు దానిని చెనక లేకపోయిరి. ఆ పొగరుబోతు గుఱ్ఱమును లొంగఁ

దీయుటకు అంతవఱకు పాదుషహా పరివారమున ఒక్కరుకూడ సమర్థులు కాకుండిరి.

పల్యాణకల్యాణము కావించి ఆపొగరుఁబోతుగుఱ్ఱమును చిన్నపద్మనాభునకు పాదుషహా బహుమానముగా ఇచ్చెను. స్వారిచేసి రమ్మని ఆజ్ఞాపించెను.

చిన్నపద్మనాభుఁడు అశ్వారోహణవిద్యయందు అందె వేసినచేయి. ఉత్తుంగతురంగములను ఎక్కి ధారాపంచిక ప్రౌఢి తప్పక నడిపించుట అతనికి అనుదినసాధనలలో ఒకటి.

కాఁగా అతఁడు పాదుషహా ఇచ్చిన పెంకెగుఱ్ఱమును అలవోకగా ఎక్కెను, ఖలీనమును పట్టెను, తఱటు చేసెను, దౌడు తీయించెను.

పెంకెతనమునకు పేరుమోసిన ఆగుఱ్ఱము అతనికి అంతలో లొంగునా?

రౌతుకొలఁది గుఱ్ఱము అని నానుడి. రౌతు సమర్థుఁడగుచో ఎట్టి పెంకెగుఱ్ఱమైనను ఇట్టె లొంగును. మహావీరుఁడగు అలెగ్జాండరు, అతని గుఱ్ఱముగాథ-ఈసంగతిని రూఢిపఱచుచున్నది.

మాసిడోనియారాజు ఫిలిప్ వద్దకు వర్తకులు ఒకసారి మేలుజాతిగుఱ్ఱమును తెచ్చిరి. ఫిలిప్ అశ్వవిద్యానిపుణుఁడైనను ఆ వారువము అతని పరీక్షకు ఆఁగలేదు. అమితమగు పెంకెతనముతో పేచిపెట్టినది. అందుచే ఆ అశ్వమును పరీక్షింపలేక ఫిలిప్ దానిని ఆవలకు కొనిపోవలసినదిగ ఆజ్ఞాపించెను.

ఫిలిప్ పుత్రుఁడు. పండ్రెండేండ్లబాలుఁడు అలెగ్జాండరు అప్పుడు అక్కడ ఉండెను. తండ్రిఆజ్ఞను ఆలించి అది చాల

మంచిఅశ్వమనియు, పూర్తిగ పరీక్షింపక దానిని విడిచివేయరాదనియు అతఁడు ఒత్తిపలికెను. ఫిలిప్ ఆమాటను వినెను. అది కుడియెడమలు తెలియని కుఱ్ఱవానిమాటగా అతఁడు పరిగణించెను.

పూర్తిగ పరీక్షింపవలెనని పలుకుచు అలెగ్జాండరు ఆ గుఱ్ఱముకళ్ళెమును పట్టుకొనెను. ఆ పట్టుకొనుటలో ఏమి పస ఉండినదో ఆఅశ్వము పెంకెతనమునంతనుపోకడపెట్టినది. అలెగ్జాండరు అలవోకగా ఆ అశ్వమునెక్కి కొంతసేపుస్వారిచేసెను.

మాసిడోనియాలో గ్రీకుయువకవీరుఁడు అలెగ్జాండరు పరీక్షార్థము వచ్చిన పెంకెగుఱ్ఱమును వంగఁదీసినట్లే ఢిల్లీలో ఆంధ్రయువకవీరుఁడు చిన్నపద్మనాభుఁడు పరీక్షార్థము ఈయఁబడిన పెంకెగుఱ్ఱమును వంగఁదీయఁగలుగునా?

చిన్నపద్మనాభునిరాకకు పాదుషహామున్నగువారుకొన్ని గంటలవఱకు ఎదురుచూచుచుండిరి. ఎంతకును చిన్నపద్మనాభుఁడు తిరిగి రాలేదు. పెంకెగుఱ్ఱము ఎక్కడనో అతనిని పడఁద్రోసియుండుననియు, అతఁడు మరణించియుండుననియు వారు అందఱు అనుకొనిరి.

ఒక పగలు, ఒక రాత్రి మొత్తము ఇరువదినాలుగుగంటలతరువాత గుఱ్ఱముమీఁదస్వారిచేయుచు చిన్నపద్మనాభుఁడు వచ్చెను. ఈ యిరువదినాలుగుగంటలలో ఒక్కసారికూడ ఆఁపక అతఁడు తఱుటుచేయుచు గుఱ్ఱమును పరుగెత్తించుచునేయుండెను.

మిక్కిలి వేగమునను, మిక్కిలి మందమునను కాని ఆస్కందితగమనమున కొంతసేపు పరుగెత్తించెను. ఆస్కందితగమ

నముకంటె కొంచెము ఎక్కువ వడిగల ధౌరితకగమనమున మఱికొంత సేపు పరువెత్తించెను. అతివేగముగా దాఁటుచుపోవు ప్లుతగమనమున వేఱొకకొంత కాలము పరుగెత్తించెను. వంకరగా తిరుగక వడిగాఁబోవు రేచితగమనమున మఱికొంత కాలము పరుగెత్తించెను. మీఁదికి కాళ్లెత్తి కదలించుచు వడిగాఁబోవు వల్గితగమనమున వేఱొకకొంత సేపు పరువెత్తించెను.

ఈ ఐదుగతులచే పరుగెత్తించుటయే కాక ఆగుఱ్ఱముచే నాలుగురీతుల దాడులును తీయించెను. మిక్కిలి వడిగాఁ బరుగెత్తు పరువడిఅను దాడు, పామువలె వంకరవంకరగా నడుచు భంజళి అను దాడు, మురళి అనుదాడు, రవణముఅను దాడు ఆ గుఱ్ఱముచే అతఁడు తీయించెను.

ఇరువదినాలుగుగంటలు విరామమెఱుఁగక ఈ గమనములతో, ఈ దాడులతో ఆగుఱ్ఱము పొగరంతయుపోయినది.

అది మిక్కిలి అలసి నురుఁగులు గ్రక్కుచుండెను.

చిన్నపద్మనాభుఁడు సదర్పముగ గుఱ్ఱముమీఁదనుండి దిగెను. కొంత సేపటికి పిమ్మట పాదుషహా అశ్వరక్షకులువచ్చి గుఱ్ఱముమీఁది జీనము మొదలయినవి తొలఁగింపఁబోయిరి. అప్పటికే గుఱ్ఱము చచ్చిపోయిఉన్నది. పక్కెర, టంగువాఱు, పల్లము, మొగముట్టు మొదలయిన అలంకారములు తీయుకదలింపులో అది క్రిందపడిపోయినది.

చిన్నపద్మనాభుని మట్టుపెట్టుటకు కారణమగునని తాను భావించిన గుఱ్ఱము చిన్నపద్మనాభుని ధాటికి ఆఁగలేక అసువులు పాసినందుకు పాదుషహా పరమాశ్చర్యము నందెను. అశ్వారోహణవిద్యయందలి అతని అసదృశప్రజ్ఞకు పాదు

మహా ఆశ్చర్యచకితుఁ డయ్యెను.

ఈపరాక్రమక్రియారచనచేత నేకాక వ్యాఘ్రభేదనము మున్నగు శౌర్యచర్యల మఱికొన్నిఁటిచేతకూడ చిన్నపద్మనాభుఁడు ఢిల్లీశుని మెప్పించెను.

అప్పుడు ఢిల్లీశుఁడు అతనికి కొండపల్లిసర్కారులోని పెనుగంచిప్రోలు, బేతవోలు మున్నగు పరగణాలకు సనదు నిచ్చెను; నౌబత్తు లోనగు బహుమతుల నిచ్చెను; దేశముఖీ పర్వ్ నిచ్చెను; దేశమునకు పోవుటకు అనుజ్ఞ నిచ్చెను.

యువకుఁడుగా ఉండఁగనే ఇంతటి శౌర్యధుర్యుఁడై వఱలుటచే చిన్నపద్మనాభుని వీరయౌవనమును కవులు ఉత్ప్రేక్షాసరసముగ ఇట్లు కీర్తించిరి:

సీ. చనుబాలు గ్రోల నేర్చిన నాఁటిసుత రిపు
ప్రతతియశము పేరి పాలు గ్రోలెఁ
బలుక నేర్చిననాఁటబట్టి దుష్టాహిత
శ్రేణినుద్ధతి ధిక్కరించి పలికె
నడువంగ నేర్చిననాఁటనుండియు నిరం
తరదిగ్జయప్రయాణముల నడిచెఁ
గ్రీడ సల్పంగ నేర్చిననాఁటఁగోలె వై
రి క్షేపకాహవక్రీడ సల్పెఁ

తే. కఠినగుణటంకృతిధ్వానగర్జనోగ్ర
కార్ముకఘనఘనాఘనాఖండకాండ
వర్ష శమితారిదోర్మహోవ్యాజవన్య
నలశిఖాతతి చినపద్మనాభనృపతి.

—అమరవాది రామయకవి

మన్నారుదేవనాయకుని ఉదంతమున అతని తండ్రి విజయరాఘవనాయకుఁడు ఒకగుఱ్ఱముపైనుండి మఱియొక గుఱ్ఱముపైకి లంఘించునేర్పు కలిగిఉండినట్లు చదివిఉన్నాము. వాహ్యాళిలో ఒకగుఱ్ఱముమీఁదనుండి మఱియొకగుఱ్ఱముపైకి లంఘించుట సామాన్యవిషయమా? వాహారోహరేవంతులయిన విజయరాఘవనాయకునివంటి వాహినీపతులను, తురగరేవంతులయిన చిన్నపద్మనాభునివంటి యువకవీరులను ప్రసవించిన ఆంధ్రమాత ధన్యురాలు.

ఆంధ్రులవీరయుగమున కమ్మ, రెడ్డి వెలమ మున్నగు కులములవారు అశ్వారోహణవిద్యయందు ఆశ్చర్యచారిత్రులై యుండిరి.

వెలమలలో ఒకప్రముఖుఁడు అశ్వారోహణవిద్యయందు అసమానప్రాభవము చూపి అశ్వారావుబిరుదుప్రఖ్యాతి నంది ఆపేరిటి గృహనామము కలవారికి మొదలిటివాఁడై నాఁడు.

రెడ్లలో రాజమహేంద్రవరపు అల్లయరెడ్డినందనుఁడు దొడ్డయరెడ్డి తానెక్కిన గుఱ్ఱమును వాహ్యాళిప్రదేశమునందు ఇరువదినాలుగుమూరలమేర దాఁటించి కాశీఖండకావ్యమున శ్రీనాథమహాకవిచేతను, శివలీలావిలాసకావ్యమున నిశ్శంకు కొమ్మయామాత్యకవివర్యునిచేతను కీర్తితుఁడై నాఁడు.

కమ్మవారిలో వాసిరెడ్డి చిన్నపద్మనాభుఁడు తన అశ్వారోహణవిద్యవలన ఒక జమీనే సంపాదించినాఁడు.

అశ్వవిద్యానిపుణులను తెనుఁగువారు రేవంతులు, రాహుత్తులు అని రెండుతెగలుగా వ్యవహరించిరి. రేవంతులు అనఁగా అశ్వశిక్షకులు. రాహుత్తులు అనఁగా గుఱ్ఱపురౌతులు.

కథాసరణిఁబట్టి చూడఁగా చిన్నపద్మనాభుఁడు రేవంతుఁడు, రాహుత్తుఁడు కూడ నని తెలియుచున్నది.

కళ్ళాలఁ బదిలముకాక పెనఁగుదుష్టాశ్వములనుశిక్షించు నేర్పుఁగల రేవంతుఁడు, రాహుత్తుఁడై నప్పుడు ఎట్టి గుఱ్ఱమైనను ఇట్టె లొంగును. శూకలము అనఁదగిన ఢిల్లీ అశ్వము పొగరును చిన్నపద్మనాభుఁడు అలవోకగా అణఁచినాఁడు.

ఇరువదినాలుగుగంటలు ఏకథాటిని గుఱ్ఱపుస్వారి ! రాహుత్తులలో అంతటివాఁడు అంతకుపూర్వము పుట్టలేదు ; ఆ పిమ్మటను పుట్టలేదు.

అశ్వహృదయము నెఱుఁగుటలో పురాణప్రసిద్ధులైన నలుఁడు, నకులుఁడు మున్నగువారితో సాటివచ్చు ఈ చారిత్రక పురుషుఁడు ఆంధ్రయువకుఁడగుట మనకు విశేషగర్వకారణము.

౭

# కట్టబొమ్మ సుబ్బనాయకుఁడు

ఉంతయు పోగుచేసి అతనికి పదునెనిమిది సంవత్సరములు లోపు, పైఁగా అతఁడు చెవిటిమూఁగ.

ఐనను అతఁడు పరమాశ్చర్యకరములైన పటుసాహసిక్యములు నెఱపెను. టిప్పుసుల్తానువంటి మైసూరుమహాశూరుని గెలువఁగలిగిన తూర్పుఇండియాకంపెనివారిని అతఁడు కొంతకాలము గుడుగుడుగుంచములు ఆడించెను.

ఇరువదియవశతాబ్ది తొలిపాదమున గోదావరిమన్యమున శ్రీ అల్లూరి సీతారామరాజు బ్రిటీష్‌వారిని గోడుకుడిపినట్లే పందొమ్మిదవశతాబ్ది ప్రారంభమున తిరునల్వేలి ప్రాంతమున అతఁడు కుంపినివారిని గోడుకుడిపెను.

అతనిపేరు సుబ్బనాయకుఁడు. అతని ఇంటిపేరు కట్టబొమ్మవారు.

కట్టబొమ్మ సుబ్బనాయకుఁడు ఆంధ్రవీరయువకులలో ఒకఁడు. ఆ ఆంధ్రవీరయువకుని కార్యక్షేత్రముమాత్రము ఆంధ్రదేశముకాక తమిళదేశమై యుండెను. తమిళదేశమున ఆ ఆంధ్రవీరయువకుఁడు నెఱపిన శౌర్యచర్య పాళెగారియుద్ధముగ చరిత్రయందు ప్రసిద్ధిచెందినది.

'నోరువాయి' లేని పదునెనిమిదేండ్లపడుచువాఁడయ్యు అతఁడు పాళెగారియుద్ధమున నిరుపమానసమరవిద్యానైపుణ్య

మును, అసదృశప్రజావశీకరణశక్తిని ప్రదర్శించి శత్రుపక్షము వారిచేతకూడ సెబాస్ అని అనిపించుకొనెను.

ఏడమూకుఁడయ్యు మహాసేనుఁడు, యువకుఁడయ్యు శౌర్యగుణవృద్ధుఁడు ఐన అతని వీరగాథ ఆంధ్రుఁడైనవాఁడు ప్రతివాఁడును వినఁదగినది.

మధుర ఆంధ్రనాయకరాజ్య ప్రతిష్ఠాపనాచార్యుఁడైన విశ్వనాథనాయకుఁడు తన విశాలరాజ్యభాగమును (ఇప్పటి మధుర, తిరుచునాపల్లి, రామనాథపురము, తిరునల్వేలి మండలములు) డెబ్బదిరెండుపాళెములుగా విభాగించి వానికి డెబ్బది ఇద్దఱు పాళెముగాండ్రను నియమించెను.

ఈ నియమించుటలో అతఁడు ఒక మెలఁకువ వహించెను. తనరాజధానీనగరమైన మధురకు సమీపమున ఉన్న పశ్చిమ, ఉత్తరదిగ్భాగములందు నియమించిన పాళెగాండ్రలో కొంద అను తమిళుల నియమించెను. మధురకు దూరముగనున్న దక్షిణదిగ్భాగమున నియమించిన పాళెగాండ్ర నందఱను స్వజాతీయులైన ఆంధ్రులను నియమించెను.

పరజాతీయులైనను తమిళపాళెగాండ్రు సమీపస్థులగుటచే తాను తగిన అదుపులో ఉంచవచ్చుననియు, స్వజాతీయులగుట తెలుఁగుపాళెగాండ్రు దూరమున నుండినను విశ్వసనీయులై ఉందురనియు అతఁడు ఆశించియుండవచ్చును.

పాళెగారిపద్ధతిలోని వివరములు తెలిసికొనతగ్గవి. ఒక్కొక్క పాళెగానికి కొన్నిగ్రామములు, ఒకకోట, యుద్ధకాలములో రాజునకు వారు సహాయార్థము సేనలను పంపవలయును. స్థానికప్రదేశసంరక్షణనిమిత్తము వారు పన్నులు

వసూలుచేయు అధికారము కలిగిఉండిరి. కేంద్రమునకు చెందిన పన్నులనుకూడ వారే వారిపాళెములందలి పల్లెలలో వసూలుచేయువారు. వారిఖర్చులకు పోను మిగిలిన పైకమును రాజునకు పంపువారు. ఆ పైకము కాలక్రమమున కప్పము, పేష్కషు మున్నగు నామములను అందినది. కేంద్రము బలయుతముగ ఉన్నంతకాలము ఈపద్ధతి బాగుగ నడచినది. కేంద్రము బలహీనమగుటతోడనే ప్రతిపాళెగాఁడును స్వతంత్రుఁడై అన్యోన్యము కలహించుచు ఇతర పాళెగాండ్ర గ్రామములను దోఁచుకొనువాఁడు.

పాళెగాఁడు అను శబ్దము ఆంధ్రశబ్దము. పాళయక్కారన్ అనునది దానికి తమిళపర్యాయపదము. పాళెగాండ్రలో పలువురు తెలుఁగువారగుటచే దేశము తమిళదేశమైనను పాళయక్కారన్ అను తమిళశబ్దము కాక తెలుగుమాట ఐన పాళెగాఁడు అనునదియే సర్వత్ర వాడుకలోనికి వచ్చినది. ఈ సంగతిని ఈదేశపుచరిత్రకారులేకాక కాల్డువెల్లు మున్నగు పాశ్చాత్యపరిశోధకులుకూడ చెప్పిఉన్నారు. తమిళదేశమున తూర్పు ఇండియాకంపెనివారిపయి ఈపాళెగాండ్రు సాగించిన యుద్ధమునకు తమిళసంప్రదాయమున పాళయక్కారన్ యుద్ధము అను నామముకాక ఆంధ్రసంప్రదాయము పాళెగారియుద్ధము అను నామమే చరిత్రప్రసిద్ధి నందినది.

మధురఆంధ్రనాయకరాజులు తమరాజ్యదక్షిణదిగ్భాగమున నెలకొల్పిన తెనుఁగుపాళెగాండ్రలో కట్టబొమ్మ సుబ్బనాయకుని పూర్వికుఁడు ఒకఁడు. కట్టబొమ్మవారు ఆదిలో బళ్ళారిప్రాంతమునుండి దక్షిణాదికి వలసపోయిన తెలుఁగువా

రని చరిత్రకారులు చెప్పుచున్నారు. కట్టబొమ్మవారి పాళెముకు ప్రధానస్థానము పంచాలన్ కురిచి. అది తిరునల్వేలి మండలమున పూర్వోత్తరదిగ్భాగమున కన్యాకుమారినుండి రామేశ్వరమునకు పోవు రస్తామీఁద ఉన్నది.

విజయనగర రాజుల కాలమున, మధుర నాయక రాజుల కాలమున దక్షిణాదికి వలస వెళ్ళిన తెలుఁగుకులములలో రాజులు, బలిజెలు, రెడ్లు, కమ్మలు, గొల్లలు ముఖ్యులు. వీరిలో రెడ్లు, కమ్మలు, గొల్లలు సంఖ్యాధికులు. ఇందు కమ్మలు, గొల్లలు కూడ తమ నామముచివర నాయకశబ్దమును వాడుకొందురు. తమిళభాషలో కమ్మలను కమ్మవన్‌లనియు, గొల్లలను కంబళట్టన్‌లు లేక తొట్టియన్‌లు అనియు వ్యవహరింతురు. ఇట్లు వలసవచ్చిన తెలుఁగుకులములను అరవలు సాముదాయకముగ వడుగరులు (ఉత్తరాదివారు) అని వ్యవహరింతురు.

పరికింపఁగా దక్షిణాదిని వలస నెలకొనిన తెలుఁగుకులములవారు వలస నెలకొనుటలో తమిళప్రదేశములను తమలో తాము పంచుకొనినట్లు కనిపించుచున్నది. తిరునల్వేలిమండలములోని ఎట్టియాపురముగుండ ఉత్తరదక్షిణముగా ఒకగీఁత గీచితి మనుకొనుఁడు. ఈ గీఁతకు పశ్చిమభాగమున కమ్మల వలసలు ఎక్కువ. ఈగీఁతకు తూర్పుదిక్కున గొల్లల వలసలు మెండు. వీరి వలసలకు ఇంకను తూర్పున సముద్రతీరమున రెడ్లవలసలు హెచ్చు.

మనప్రస్తుతకథలో ప్రస్తావితులగుచున్న కట్టబొమ్మవారు గొల్లలు. వారి కాపురపు రాణాచియైన పంచాలన్ కుర్చి, కోయిల్ పట్టితాలూకాలోనిది. కోయిల్ పట్టి తాలూకాలోని

పాళెగాండ్రు అందఱును తొట్టియన్ కులమునకు చెందిన వారే. వారిలో పంచాలన్ కుర్చిపాళెగాఁడును, ఎట్టియాపురము పాళెగాఁడును ప్రముఖులు.

ఈ తొట్టియన్ కులమునుగుఱించి స్టూవార్టు 1891 జనాభా నివేదికలో ఇట్లు చెప్పుచున్నాఁడు:

"తొట్టియార్ లు మధుర, తిరునల్వేలి, కోయంబత్తూరు, సేలము మున్నగు జిల్లాలలో వలస నెలకొనిన తెలుఁగుకర్షకులు. మధురమండలమునకు వారి రాకను తెలుపు ఐతిహ్యములు మెకంజీద్వార సేకరించిన కైఫియతులందుకలవు. తొట్టియారులనే కంబళత్తారులనికూడ అనెదరు. వారు కానుగవృక్షమును పూజింతురు. తుంగభద్రానదికి ఉత్తరప్రాంతమునుండి తాము ఆదిలో వచ్చినట్లు వారు చెప్పుదురు. విజయనగరరాజుల, మధురనాయకరాజుల సేవలోచేరి వారు ప్రతిష్ఠ గడించిరి."

తొట్టియన్ కులమువారు మధురనాయకులక్రింద పాళెగాండ్రుగా, యుద్ధభటులుగా ప్రబలిరి. వారిది వైష్ణవ సంప్రదాయము. తొట్టియన్ కులమున రెండుశాఖలు. అందు ఒక శాఖకు సిల్లవన్ లు అనియు, రెండవశాఖకు తొక్కలవన్ లు అనియు అరవపేళ్లు. ఇవి తెలుఁగులోని గొల్ల, ఎఱ్ఱగొల్ల శాఖలకు పర్యాయపదములు.

ఎట్టియాపురము, పంచాలన్ కుర్చిపాలకులు ఈ శాఖలలో చెఱియొక్కదానికిని ప్రతినిధులై ఉండిరి. ఎట్టియాపురము పాళెగాఁడు సిల్లవార్ శాఖకు చెందినవాఁడు. పంచాలన్ కుర్చి పాళెగాఁడు తొక్కలవార్ శాఖకు చెందినవాఁడు. సిల్లవార్, తొక్కలవార్ శాఖలనడుమ రవరవలు ప్రబలియుండెను. శాఖా

ఘోషమువలని ఈ రవరవలమూలమున పాళెగారి యుద్ధగమనము మారుపథమున పడెను. పంచాలన్‌కురిచిపాలకుఁడు కుంపినికి ఎదురుతిరిగి పాళెగారియుద్ధమునకు మొనగాఁడుకాఁగా ఎట్టి యాపురముఏలిక కుంపినివారితో కుమ్మక్కు ఆయెను.

పంచాలన్‌కురిచి అను నామము సంస్కృత, తమిళ శబ్దముల సమాసము. పంచాలన్ అనఁగా ఐదువృత్తులవారు అని అర్థము. కురిచి అనఁగా పల్లె అని అర్థము. పంచాలన్ కుర్చి అను నామమును సంగ్రహపఱచి పాంచాయ్ అని కూడ వ్యవహరించుట కలదు. ఐదువృత్తులవారి పల్లెయు, కట్ట బొమ్మవారి కాఁపురపుకాణాచియు అగు పంచాలన్‌కురిచిలో కోటకు రెండుప్రహరులు. వెలుపలిప్రహరి మట్టితో నిర్మితమై నది. ఆ మట్టిగోడ రెండుగోడలమందమున ఉండెను. ఆ మట్టి ప్రహరిచుట్టును వెడల్పయిన కంపకోట. చుట్టునుముళ్ళకంపల కంచెకోటయే కాని దానికి కందకము లేదు.

పంచాలన్‌కుర్చిపాళెముక్రింద సుమారు నూరుగ్రామ ములు ఉండునవి. వాటి మొత్తపుజనాభా ఏఁబదివేలు.

ఆ పాళెముపాలకుల ఇంటిపేరు కట్టబొమ్మవారు. కట్ట బొమ్మఅనునది గృహనామమైనను ఆప్రాంతపు అరవల పరిభా షలో అది రాజునకు పర్యాయపదమైనది. పంచాలన్‌కురిచి పాలకులను వారు కట్టబొమ్మనాయకులు అని వ్యవహరించు వారు. మహావీరులగుటచే జగవీరబిరుదమును, వారి పాలిత ప్రదేశము పాండ్యదేశమగుటచే పాండ్యబిరుదమును ఆ పాల కులు ధరించుచువచ్చిరి. అసలుపేరునకు తోడు జగవీర పాండ్య కట్టబొమ్మనాయకనామమును ఆ పాళెగాండ్రలో ప్రతిఒక్క

కును వహించుచుండిరి.

మన కథాకాలమునాఁటి పంచాలన్ కురిచి పాలకుని నామము జగవీర పాండ్య కట్టబొమ్మ కరటయ్యనాయకుఁడు.

పాళెగాండ్రపద్ధతినిఏర్పఱచిన మధుర నాయక రాజ్యము కాలక్రమమున అస్తమించినది. నాయక రాజుల పరిపాలనకు తరువాత కర్ణాటక నవాబుల ఏలుబడి కొద్దికాలము సాగినది. మనకథాకాలమునాఁటికి ఆప్రాంతమున కుంపినివారి పరిపాలన ప్రారంభమయ్యెను.

క్రీస్తుశకము 1781-వ సంవత్సరమున కర్నాటక నవాబు తిరునల్వేలి మండలమును కుంపినివారికి ఇచ్చెను. కుంపినివారు 1790-వ సంవత్సరమున ఆ మండలమును సక్రమ పద్ధతులపై పరిపాలించుటకు దొరకొనిరి. అప్పటికి ఆ మండలమున ముప్పదియొక్క పాళెములకు పైఁగా ఉండెను.

నవాబులదర్బారుదినములలోవలె కాక కుంపినివారి పరిపాలన ప్రారంభమగుటతోడనే పాళెగాండ్రు ఈయవలసిన పన్నుబందులవిషయమై నిక్కచ్చి ఎక్కువయ్యెను. ఆనాఁటి పాలెగాండ్రందఱును సాగినంతకాలము కుంపిని అధికారులకు మొగముచాటువేసి పన్నుబందులు ఎగఁగొట్టుటకు ప్రయత్నించుచువచ్చిరి. ఇఁక ఈపద్ధతిని తుదముట్టించుటకు కుంపినివారు కృతనిశ్చయులైరి. జిల్లాకలక్టరులకు తాఖీదులను పంపిరి. తిరునల్వేలి జిల్లాకలక్టరుకును అట్టి తాఖీదు వచ్చెను.

అప్పటి తిరునల్వేలిజిల్లా కలెక్టరునామము జాక్సన్. అతఁడు 1797-వ సంవత్సరమున తిరునల్వేలి జిల్లా కలక్టరుగా నియమితుఁడయ్యెను.

అతఁడు కలెక్టరుగా నియమితుఁడగుసరికి అచ్చటి పాళెగాండ్రు పన్నులు ఎగఁగొట్టుటకే కాదు, అవసరమగుచో తిరుగుఁబాటు నెఱపుటకును సంరంభములుసాగించుచుండిరి. ఈ తిరుగుఁబాటుసంరంభమునకు కట్టబొమ్మనాయకుఁడు నాయకుఁడై నిలచెను. నాగలాపురము, కోటార్పట్టి, కాడల్‌కుడి, మేల్‌మాండెయి, కులత్తూరు, ఈటయిరాంపన్నె మున్నగు పాళెగాండ్రు అతనికి ముఖ్యానుచరులై ఉండిరి.

ఆ పాలెగాండ్రందఱును కుంపినివారి తాఖీదులను తోసిరాజనువారు. పేష్కుషు వెంటనే పంపవలసినదిగ కలెక్టరు పంపిన తాఖీదుకు సమాధానముగ కూంబీపాళెగాఁడు గోనె నిండుగ గులకరాళ్ళు వేసి పంపెను.

ఇట్లు పాళెగాండ్ర అవిధేయతకు అవధిలేకుండెను. గట్టిగపట్టిన కాని ఇఁక కార్యములేదని కలక్టరు జాక్సను తన ఏలుబడి ప్రాంతములోని పాళెగాండ్ర అందఱిలో మొనగాఁడైన కట్టబొమ్మ కరటయ్యనాయకునకు గట్టిగా కబురు చేసెను. ఇట్లు గట్టిగా కబురుచేసినది 1798-వ వత్సరమున జూన్ మాసములో. వీలున్నంతవఱకు ఈసారికూడ కరటయ్య నాయకుఁడు కాలయాపన చేసెను.

నాలుగు మాసములు కాలయాపన చేసెను. తుదకు సెప్టెంబరుమాసము 10-వ తేదీని కరటయ్య నాయకుఁడు కలక్టరుదర్శనమునకు పోవకతప్పినది కాదు.

కలక్టరుదర్శనమునకు అతఁడు మితమును, సామాన్యమును ఐన పరివారముతో కాక అమితమును, సాయుధమును ఐన పరివారముతో పోయెను. ఇది కనిపెట్టి జాక్సన్

ఒకపట్టున అతనికి దర్శన మీయక మకాములవెంట మకా ములు తిప్పెను. తుదకు రామనాథపురమున దర్శన మిచ్చెను.

సంప్రదింపులు ప్రారంభమైనవి. పాఁత ఉత్తరప్రత్యు త్తరముల పరిశీలన మొదలైనది. ఆసందర్భమున ఉదయించిన చర్చలో కరటయ్యనాయకుఁడు వంచన జరిగి తాను ఖైదీ కాఁబోవుచున్నట్లు అనుమానించెను.

తోడనే అతఁడు తప్పించుకొనిపోవలెనని తలఁచెను. తన తలఁపు పండఁబాఱుటకు అతఁడు నేర్పుతో పనిచేసెను. కొంచెముసేపు విశ్రాంతి తీసికొనుటకు అనుమతి కోరెను. జాక్సను అనుమతి ఇచ్చెను.

విశ్రాంతికోరిన కరటయ్య విశ్రాంతికి అనుమతినందు కొని నెమ్మదిగా నడిచిపోలేదు. కచ్చేరిగదినుండి నూటపఁబది గజముల దూరముననున్న కోటగుమ్మమువద్దకు పరుగెత్తెను. ఆ ఆవరణలో ఉండిన అతని అనుచరులు అతనిని వెంబడించిరి. ద్వారపాలకులు అడ్డఁబోగా అతని అనుచరులు వారిని "సఫా" చేసిరి.

ఆ సమయమున కచ్చేరికోటలోనికి వచ్చుచుండిన లెఫ్టి నెంటు, సేనలోని అడ్జుటెంటు (Adjutant) ఉద్యోగి ఐన క్లార్కు అనునతఁడు కరటయ్యనాయకుని చూచి సమీపించి తిరిగి కచ్చేరిలోనికి రావలసినదని కోరెను; కరటయ్యనుచుట్టు ముట్టుచున్న సిపాయిలను వారించుచు అతనికి ఎట్టిహానికాని చేయవలదని హెచ్చరించెను.

కరటయ్య పెదవి మెదపలేదు. తనకటారిని తీసిక్లార్కు కుడిరొమ్ముమీఁద పొడిచెను. ఆ పోటునకు క్లార్కు నిలు

చున్నవాఁడు నిలుచున్నట్లే ప్రాణములు విడిచి నేలకొరగెను.

క్లార్కు హెచ్చరికను ఆలించి అంతవఱకు ఊరక యుండిన సిఫాయిలు అప్పుడు తుపాకులు ప్రేల్చఁదొడఁగిరి. పాళెగానిభటులు వారిని ఎదురుకొనిరి.

ఆ దొమ్మికయ్యములో ఇద్దరు సిఫాయిలకు ప్రబలము లైన గాయములు తగిలినవి. పాళెగానిభటులు కొందఱు మరణించిరి; కొందరు గాయపడిరి; కొద్దిమందిమాత్రము ఖైదీలుగ చిక్కిరి. చనిపోయిన తన భటుల శవములనుకూడ మోయించుకొనుచు పంచాలన్‌కురిచిపాళెగాఁడు కట్టబొమ్మ కరటయ్యనాయకుఁడు కచ్చేరినుండి కలక్టరుకళ్ల ఎదుటనే తప్పించుకొనిపోయి స్వస్థలము చేరుకొనెను.

నడచిన వృత్తాంతమును జాక్సను రివిన్యూబోర్డువారికి నివేదించెను. అందుమీఁద వారు విషయ మంతయు సమగ్రముగ విచారించుటకు ముగ్గురుపెద్దలతో కూడిన ఒక కమీషనును నియమించిరి.

కుంపెనీవారికి ఆనాఁడు టిప్పుసుల్తానుతో మైసూరు యుద్ధమున చేతినిండ పని ఉండినది. ఆ తరుణముననే పంచాలన్‌కురిచిపాళెగానితోకూడ సమరము తలపెట్టుట మంచిది కాదని వారు తలఁచిరి.

వారి తలంపులు ఎఱిఁగిన విచారణాధికారులు కలక్టరు జాక్సన్ చాకచక్యములేకుండ వ్యవహరించెననియు, లెఫ్టినెంటు క్లార్కు హత్యవిషయములో కట్టబొమ్మ కరటయ్యనాయకునకు ఎట్టి శిక్షకాని విధింపనక్కఱలేదనియు నివేదించిరి.

అప్పుడు కుంపినివారు జాక్సన్‌ను తొలఁగించి అతని

స్థానమున స్టీఫెన్ రంబోల్డు లషింగ్టన్‌ను 1799-వ సంవత్సరము జూన్ 12-వ తేదీని తిరునల్వేలిజిల్లాకు కలెక్టరుగా నియమించిరి.

లషింగ్టన్ ప్రథమప్రధానకృత్యము కట్టబొమ్మ కరటయ్యనాయకుని దారికి తెచ్చుట. కాని ఆపనిలో ఆనాఁటి జాక్సన్‌కంటె ఈనాఁటి లషింగ్టన్ క్రొత్తగా ఏమియు ఊడఁబొడువలేకపోయెను. అతఁడు ఎన్నికబురులుపెట్టినను కరటయ్య నాయకుఁడు దర్శనమునకు రానేలేదు.

ఎట్లయిన అతనిని సుముఖునిగ చేసికొనుటకు లషింగ్టన్ కోటవద్ద దొమ్మిలో ఖైదీలుగ పట్టుపడిన కట్టబొమ్మనాయకుని సేవకులను విడిచిపెట్టెను; కుంపినిఅధికారమునకు అంగీకరించి పేష్కషు సక్రమముగ చెల్లించుచో కరటయ్యనాయకుఁడు లోఁగడచేసిన తప్పిదము లన్నియు మాఫుచేయబడునని ప్రకటించెను.

అతఁడు ఇట్లు బహిరంగముగ ప్రకటన చేయుటయే కాక ప్రత్యేకముగ కరటయ్యనాయకునకు ఒక దీర్ఘలేఖను వ్రాసెను. అందు ఆతఁడు కట్టబొమ్మనాయకుని తప్పులన్నియు మాఫుచేసినట్లు వ్రాసెను; పాళియగాండ్రు ప్రవర్తింపవలసిన తీరును గుఱించి ధర్మపన్నములు ఎన్నియో వ్రకరువుపెట్టెను; ఒక్కసారివచ్చి తననుచూచి పొమ్మని కోరెను.

ఆ బహిరంగప్రకటనమునకు కాని, ఈ ప్రత్యేకలేఖను కాని కరటయ్యనాయకుడు మెత్తబడి లొంగిరాలేదు. పైఁగా కుంపినిపక్షమున చేరిన శివగిరిపాలెముమీఁదికి సాయుధులగు తనసేవకులను పంపి అల్లరులు రేఁపెను.

సామోపాయము ఏమియు పనిచేయలేదు. కావున ఇఁక దండోపాయము చేకొనకతప్పదని లషింగ్టన్ కుంపినివారికి వ్రాసెను. అప్పటికి మైసూరుయుద్ధము ముగిసినది. టిప్పు సుల్తాను మడిసినాఁడు. అందుచే ప్రభుత్వము పంచాలన్‌కుర్చి వ్యవహారవిషయమై పూర్ణదృష్టిని పఱపుటకు అవకాశము కలిగినది. అప్పుడు అనఁగా ఆగష్టుమాసమధ్యమున ప్రభుత్వము కొంత సేనను ఇచ్చి మేజరు బానర్‌మాన్ అను సేనానిని తిరునల్వేలిమండలమునకు పంపినది. ఆ యుద్ధవిషయమున ప్రభుత్వము అతనికి సంపూర్ణాధికారమును ఇచ్చినది.

సంపూర్ణాధికారమును పొంది మేజరు బానర్‌మాన్ వచ్చెను. వచ్చినవెంటనే అతఁడు కరటయ్యకు కఠినాక్షర కలితమగు తాఖీదుపంపెను.

సాయుధుఁడగు సేవకుఁడు ఒక్కఁడుకూడ వెంటలేకుండ కరటయ్య విధేయుఁడై వచ్చి, బాకీఉన్న పేష్కషుపూర్తిగ చెల్లించి, శివగిరిపాళెమున అల్లరులు రేఁపినందుకు సముజాయిషీ చెప్పుకొనవలసినదిగ ఆ తాఖీదునందు ఉండెను.

ఆ తాఖీదుకు తప్పించుకొని తిరుగఁగలయంత కాలము ఆ పాళెగాఁడు తప్పించుకొని తిరిగెను. ఆమీఁద ఒకటిరెండు సారులు వాయిదాలుకోరుచు కాలయాపన చేసెను. అటు పిమ్మట దర్శనము ఐనతరువాత అతనిని అతనికోటకు సురక్షితముగా చేరనిచ్చువిషయమున కరారునామా కోరుచు కొంతకాలము వెళ్ళఁదోసెను.

ఈ కాలయాపన కార్యకలాపమును కంటగించుకొని బానర్‌మాన్ సేనాసమేతుఁడై సెప్టెంబరు 5-వ తేదీని పంచా

లన్ కుర్చి పాళెముపట్టునకు పోయెను.

ఆ సమయమున ఆతని సేనలో ఉండినవారు అంతయును దేశీయులు. ఐరోపియను సేన కొంత రావలసియుండెను. ఆ సేన వచ్చువఱకు వేచియుండనేల అను అహంభావముతో తనవద్ద ఉన్న సేనతోడనే బానర్ మాన్ పంచాలన్ కురిచికోటను పట్టుకొనుటకు ప్రయత్నించెను.

కందకములేని కంచెకోటతో, మట్టిగోడలతో ఆదుర్గము సులభముగ పట్టువడునని ఆతఁడు తలఁచెను. ఆతఁడును, అతని సైనికులును ఆకోటపట్ల ఒకవిధమైన నిర్లక్ష్యభావమును సంతరించుకొనిరి. కాఁగా ఎట్టి షరతులు కోరకుండ కట్టబొమ్మనాయకుఁడు వచ్చి తనకు స్వాధీనుఁడు కావలయు నని బానర్ మాన్ ఆజ్ఞాపించెను. ఈ ఆజ్ఞను కరటయ్యనాయకుఁడు పాలించలేదు. అప్పుడు బానర్ మాన్ కోటముట్టడికి అనుజ్ఞ ఇచ్చెను.

ముట్టడి ప్రారంభించిన క్రొత్తలో కోట సులభముగ లోఁగునట్లే కనిపించెను. కోటగుమ్మములలో ఒకటి బానర్ మాన్ సైనికుల కైవశము కాఁజొచ్చెను. ఆప్రాంతమున కోటగోడలో క్రంతకూడ ఏర్పడెను. లోన చొరఁబాఱుటకు వీలు కలిగినది. ఐనను బానర్ మాన్ సైనికులకు అడుగు ముందునకు పడినదికాదు.

ముట్టడించుచున్న సైనికులు ముట్టడించుచుండగనే కట్టబొమ్మనాయకునికి సహాయార్థముగా ఐదువేలమంది క్రొత్తసైనికులు వచ్చి కోటలో ప్రవేశించిరి. కోటరక్షణలను దిటవు పఱచిరి.

పంచాలన్ కురిచిపాలకుఁడు కట్టబొమ్మ కరటయ్య సాహ

సిక వీరుఁడు. ఆ సాహసిక వీరుని సేవించుటకు ఆకోటలో ఐదు వేలమంది వీరవరులు క్రొత్తగా చేరిరి. అట్టి కోటలో కాలు పెట్టుట అనఁగా సింహములున్న గుహలో ప్రవేశించుటయే. కాఁగా బానర్‌మాన్ సిఫాయి లందఱు పిఱికిపడి ముందంజ వేయలేక పోయిరి.

కోటగుమ్మము ఒకటి స్వాధీనమగుచుండును కాక, ఆ ప్రాంతమున కోటగోడలో క్రంతయు ఏర్పడును కాక, ఆ సైనికులు ముందునకు చొఱఁబాఱలేకపోయిరి. 'ముందునకు పదండి' అను బానర్‌మాన్ హెచ్చరికను వారు చేకొన నిరాకరించిరి.

ఈ స్థితిలో యుద్ధము రెండురోజులు నిలఁబాటు ఐనది. ఆ నిలఁబాటుయుద్ధము నలుగురు ఐరోపియను ఆఫీసరులను బలిగొన్నది. ఇంతలో సెప్టెంబరు 8-వ తేదీని క్రొత్తగాఐరోపియను సేన వచ్చినది. క్రొత్తగ వచ్చిన ఐరోపియనుసేనతో బాటు క్రొత్తముట్టడిసాధనములుకూడ వచ్చినవి. పంద్రెండు బారుల ఫిరంగులు రెండు వచ్చినవి.

క్రొత్తగ ఐరోపియన్ సేన వచ్చినను, క్రొత్తగ ముట్టడి సాధనములు వచ్చినను రెండుమూడురోజులవఱకు ఆకోట చెక్కుచెదర లేదు. అప్పట్టున కోటలో ఉండిన సైనికులు ప్రదర్శించిన శౌర్యము సవతులేనిదిగా ఉండెను.

వీరత్వము, సంఖ్యాబలము కట్టబొమ్మనాయకునిపక్షమున ఉండెను. సాధనసామగ్రి, సమరతంత్రము బానర్‌మాన్ పక్షమున ఉండెను. అనేక యుద్ధములలో వలెనే ఈయుద్ధమున కూడ తుదకు సాధనసామగ్రి, సమరతంత్రము ఉన్నపక్షముదే పై చేయి అయ్యెను.

ఇఁక కోట నిలఁబడదని తేలిపోయినది. కాఁగా ఆరా త్రికిరాత్రి కట్టబొమ్మ కరటయ్యనాయకుఁడు అనుజన్ములతో, అనుచరులతో పంచాలన్ కురిచికోటను విడిచిపెట్టిపారిపోయెను.

కొంతమందిఅశ్వసైనికులను, నాలుగువందలమంది కాలి బంటులను కట్టబొమ్మనాయకుని పట్టుకొనుటకు మేజరు బానర్ మాన్ పంపెను.

ఆ అశ్వసైనికులు కట్టబొమ్మనాయకుని అనుచరులను మాత్రము కొంతమందిని పట్టుకొనఁగలిగిరి. కరటయ్యనాయకుఁడును, అతని అనుజన్ములును, ముఖ్యానుచరులును తప్పించు కొని పోయిరి.

అప్పుడు మేజర్ బానర్ మాన్, పారిపోవుచున్న కర టయ్యనాయకుని వెదకి పట్టుకొని నిర్బంధించవలసినదిగా ఆ ప్రాంతమండలిఅధికారులకు, పాళెగాండ్రకు తాఖీదులుఁ పంపెను.

కట్టబొమ్మనాయకుని పట్టుకొనుటలో తాను కుంపిని వారికి తప్పక తోడుపడఁగలనని ఎట్టియాపురముపాళెగాఁడు బానర్ మాన్ తాఖీదుకు సమాధానము పంపెను. పాఁత పగలు, శాఖాభేదపు రవరవలు మనమున ఇడుకొని ఆతఁడు పరాయివాఁడయిన బానర్ మాన్ తో చేతులు కలిపెను.

ఎట్టియాపురముపాళెగాఁడు, పంచాలన్ కురిచిపాళె గాఁడు ఇరువురును తెలుఁగువారు; ఇరువురును గొల్లకులము వారు; ఇరువురును పాళెగాండ్రు. తోడి తెలుఁగువానిమీఁద, సాటి గొల్లవానిమీఁద, సాటి పాళెగానిమీఁద, మాత్సర్యము వహించి ఎట్టియాపురముపాళెముపట్టుదొర కుంపిని వారితో కుమ్మక్కు ఆయెను.

పంచాలన్‌కుర్చి, ఎట్టియాపురము పాళెగాండ్రనడుమ పరంపరగ ప్రబలవిరోధములు నడచుచుండెను. ఆవిరోధములు వారి అనుచరులనుకూడ అంటియుండెను. ఎట్టియాపురప్రభటుని పంచాలన్‌కుర్చిప్రభువు నిర్బంధించె ననుకొనుఁడు. అతని చర్మము నిలువున ఒలిచినను అతఁడు పంచాలన్‌కుర్చిపాళెగానికి చేయెత్తి నమస్కరింపఁడు. ఎట్టియాపురముపాళెగానికి మ్రొక్క నేర్చిన ఈచేయి పంచాలన్‌కుర్చిపాలకునకు మ్రొక్క దొరకొనదు అని అతఁడు అనును. అట్టిభావముతో వ్యవహరించు అనుచరులుగల ఆపాళెములు రెండును పరాయివానితో వ్యవహరించునపుడు మాత్రము ఏకమగునని ఎటులనుకొనఁగలము?

ఎట్టియాపురముసైనికులు ఆప్రాంతమువారు. కాఁగా ఆప్రదేశమునందలి మార్గము లన్నియు వారికి కొట్టినపిండ్లు. కుంపినివారి సైనికులకు ఆప్రాంతమంతయు సరిక్రొత్త. కాఁగా ఆ ప్రదేశమునందలి మార్గములలో పెక్కులు వారికి బొత్తిగ తెలియనే తెలియవు. అగుఁగాక! కుంపినిసైనికులకు ఎట్టియాపురము సైనికుల కుమ్మక్కు ఒనఁగూడుటతో పంచాలన్‌కురిచి పాలకునకు కథ అడ్డముతిరిగినది.

ఎట్టియాపురపుసైనికుల వత్తాసితో కుంపెనివారి సైనికులు కట్టబొమ్మ కరటయ్యనాయకుఁడు కోలార్పట్టికోటలో ఉన్న ఆచూకీ తీయఁగలిగిరి.

అప్పుడు తిరిగి పోరు పొసఁగినది. సంఖ్యాబలము కుంపిని తరఫున ఉండినది. ఐనను వుయిలోడక కట్టబొమ్మనాయకుఁడు ఎదురొడ్డి నిలచి పోరెను. కాని కార్యము లేకపోయినది. శత్రుబలముల పోటునకు తాళఁజాలక అతనిసైనికులు చెదరిపోయిరి.

అతఁడు మాత్రము శత్రువులచేతికి చిక్కక నేర్పుగా తప్పించు కొనిపోయెను.

చేజిక్కినశత్రువు తప్పించుకొనిపోయెనుకాక, అతని ఆచూకీతీయుటలో ఎట్టియాపురముపాళెగాఁడు విశేషముగ తోడుపడెనుకావున మేజర్ బానర్‌మాన్ ఆపాళెగానికి దుశ్శాలువలును, ఒకగుఱ్ఱమును బహుమానముచేసెను.

తనకు చేదోడుగా వచ్చిన ఎట్టియాపురము పాళెగానిని ఈవిధముగాబహూకరించి ఎదురుతిరిగిఉన్న ఇతర పాళెగాండ్రను లోఁబుచేసికొనుటకు బానర్‌మాన్ ముందుకుసాగెను.

బానర్‌మాన్ సేనాసమేతుఁడై నాగలాపురమునకు వెళ్లెను. అచటి పాళెగాఁడు అతనికి దాసోహమ్మనెను.

అవిధేయుఁడుగా కనిపించిన ఆ పాళెగానిసోదరుఁడగు సుందర పాండ్యనాయకుని పట్టుకొని బానర్‌మాన్ ఉరి తీయించెను.

పంచాలన్‌కురిచిపాళెముకోట స్వాధీనము ఐనతోడనే మేజర్ బానర్‌మాన్ పాళెగాండ్రను ఉద్దేశించి ఒక ప్రకటన చేసెను. ఆ ప్రకటనమున ఇట్లు కలదు: "కుంఫినివయి తిరుగుఁబాటుచేసినందుకు పంచాలన్‌కురిచిపాళెమును ప్రభుత్వము జప్తిచేసికొనుచున్నది. ఈతిరుగుఁబాటులో కట్టబొమ్మనాయకునిపక్షమునఉన్న ఈటయిరాంపన్నె, నాగలాపురము, కోటార్పట్టి, కాడల్‌గుడి, కులత్తూరు పాళియములుకూడసర్కారులో చేర్చుకొనఁబడును. పాళెగాండ్రు తమకోటలను పడగొట్టివేయవలయును. ప్రతిభటుఁడును తనస్వాధీనములో ఉండిన ఈఁటె, బల్లెము, జానకితాడు, తూటాలతుపాకిమున్నగు ఆయుధములు అన్నియు ప్రభుత్వమువారిపరము చేయవలయును. అట్లుచేయని

వారికి మరణశిక్ష విధింపఁబడును."

ఈప్రకటనమునందలి ఆజ్ఞలను, ఆంక్షలను పాళెగాండ్రు అందఱును తలఁదాల్చిరి.

పంచాలన్కురిచిపతనము ఇతరపాళెగాండ్రకు పిఱికిమందు పోసినది. వారి పిఱికితనమును లెస్సగ ఆకళించి మేజరు బానర్మాన్ వారిమీఁద చక్కగ సవారిచేసెను. వారినిఅందఱను ఒకచోట సమావేశపఱచెను. వారి రాఁబడులను అణాపైసలతో లెక్కచూచెను. ఒక్కొక్కరికొలువులో సాయుధులగు భటులు ఎందఱెందఱుఉన్నది; ఆయుధసామగ్రి ఎంతెంత ఉన్నది; ధాన్యాదుల నిలవలు ఎంతెంత ఉన్నది; ఒక్కొక్కరి అదుపులో ఎన్నెన్నికోటలు ఉన్నవి ఆరాలు తీయించెను. ఆ ప్రాంతమున ప్రజారక్షణకార్యములను అన్నిఁటిని కుంపినిప్రభుత్వమే చేయఁగలస్థితిలో ఉన్నది. కాఁబట్టి పాళెగాండ్రు తమతమకోటలను పడఁగొట్టివేయవలయుననియు, తమతమ పటాలములను ఎత్తివేయవలయుననియు, తమ తమవద్దఉన్న ఆయుధసామగ్రిని ప్రభుత్వమునకు అప్పగించి వేయవలయుననియు ఆతఁడు ఆజ్ఞాపించెను. పాళెగాండ్రు కిక్కురుమనకుండ అతని ఆజ్ఞలోని ప్రతిఅక్షరమును పాలించిరి. కుంపినిఅధికారులు ఒక్కొక్కపాళియముపట్టునకు పోయి దగ్గఱఉండి ఈ ఆజ్ఞా నిర్వాహణము లెస్సగ జరిగినది, లేనిది తనిఖీ చేసిరి.

అప్పటికే సముద్రతీరమంతయు కుంపెనివారి స్వాధీనములో ఉండెను. కాఁగా కట్టబొమ్మ కరటయ్యనాయకునకు దక్షిణముగా పోయి సముద్రమార్గమున పారిపోవుటకు అవకాశము లేకపోయినది. అందుచేత అతఁడు అనుచరులతో ఉత్తర

చిక్కకుండా పోవఁదొడఁగెను. పగటిపూట దాఁగుకొనుచు రాత్రి పూట ప్రయాణము చేయుచుండెను. కొద్దిరోజులలోనే అతఁడు పుదుక్కోట సంస్థానపు అడవులలో ప్రవేశించెను.

ఎట్టియాపురముపాళెగానివలెనే పుదుక్కోటరాజుకూడ కుంపినీతో కుమ్మక్కయెను. కుటిలసంకల్పముతో ఆ రాజు కట్టబొమ్మనాయకుని, అతని అనుచరులను తనభవనమునకు ఆహ్వానించెను; వారికిప్రత్యేకముబిడిది ఏర్పాటుచేసెను; గొప్ప విందులు చేసెను. నమ్మికలుపుట్టించి ఆరాజు వారిని కుంపిని అధికారులకు అప్పగించెను. వారు దొరికినవృత్తాంతమును సెప్టెంబరు 24-వ తేదీని ఆరాజు లషింగ్టనుకు తెలియఁజేసెను. వారికాలిసేతులకు బేడీలువైచి మధురలోని స్మిత్ సేనాని వద్దకు పంపునట్లు లషింగ్టను ఆజ్ఞాపించెను. స్మిత్ సేనాని వారిని మేజర్ బానర్ మానునొద్దకు పంపెను.

కాకలుతీరిన వీరుఁడు కట్టబొమ్మనాయకుఁడు ఇట్లు ద్రోహముచే దొరకిపోయెను.

మోసముచేసి తాను పట్టుకొనిన పంచాలన్ కురిచిపాళెగాఁడు మేజరు బానర్ మానునొద్దకు చేరిన సంగతి తెలిసికొని పుదుక్కోటరాజు సంతోషించెను. అప్పటికి బానర్ మాన్ కయత్తూరు మకాములో ఉండెను.

ఆనాఁడు అక్టోబరు 5-వ తేది.

బానర్ మాన్ పాంచాలన్ కురిచికోటను ముట్టడించిన పిమ్మట సరిగా నెలకు కట్టబొమ్మనాయకుఁడు అతనికిదొరకెను. ఐతే ఆదొరకుటప్రత్యేకము బానర్ మాన్ ప్రయోజకత్వమున కాదనవలయును. దేశమెఱిఁగిన ఎట్టియాపురముపాళెగాని పరీ

కుమూలమున, దేశమును మఱచిన పుదుకోట రాజద్రోహము మూలమున కట్టబొమ్మునాయకుఁడు దొరకిపోయెను.

తన ప్రత్యేక ప్రయోజకత్వమున దొరకకపోవునుకాక అతనిని తన ప్రత్యేకపర్యవేక్షణమున ఉరి తీయుటకు మేజరు బానర్‌మాన్ విపులసన్నాహములు చేసెను.

అక్టోబరు 16-వ తేదీని ఒక ప్రత్యేకసమావేశమును ఏర్పాటు చేసెను. విధేయులై తనకు అంకితులైయున్న పాళెగాండ్రనుఅందఱను ఆసమావేశమునకుఆహ్వానించెను. బానర్‌మాన్‌కు భయపడి తమ కోటలను కూల్చుకొన్న, తమభటులను మాన్చుకొన్న పాయకారిపాళెగాండ్రు ఆసమావేశమునకు ఏల రాకుందురు?

న్యాయస్థానమును ఏర్పాటుచేసినారు. పాళెగాండ్రు అందఱు వచ్చినారు. బారులుతీరి కూర్చున్నారు. ఖైదీ కట్ట బొమ్మ కరటయ్యనాయకుని అక్కడకు రప్పించినారు. విచారణ ప్రారంభమైనది.

మేజరు బానర్‌మాన్ కరటయ్యనాయకుఁడు చేసిన నేరములన్నియు వివరించెను.

కుంపినివారి ఏలుబడిని అంగీకరింపక పోవుట మొదటి నేరము.

కప్పముకట్టక కాలయాపనచేయుట రెండవనేరము.

కుంపిని అధికారుల తాఖీదు లందుకొని దర్శనమునకు రాకపోవుట మూడవనేరము.

కుంపినిమీఁద తిరుగుఁబాటుచేయుట నాలుగవనేరము.

కుంపినివారి సైనికులను పలువురను, ఉద్యోగులను కొం.

దఱను చంపుట ఐదవ నేరము.

మోపిన నేరములు ఇంకను ఎన్నియో కలవు. వానిని అన్నిఁటిని బానర్ మాన్ ఓపికగా ఏకరువు పెట్టెను.

కూడియున్న పాళెగాండ్ర అనుమతితో బానర్ మాన్ అతనికి అన్ని నేరములకు కలిపి ఉరిశిక్ష విధించెను.

ఆ శిక్షను పంచాలన్ కురిచి పాలకుఁడు వికలుఁడు కాక చేకొనెను.

మొన్న మొన్నటివఱకు కయత్తూరు పాళియముకోట ఉండిన చోటునకు కొంచెము ఆవలగా ట్రంకురోడ్డునకు ఎడమ ప్రక్కను ఒకానొక చెట్టుక్రింద వధ్యస్థలము ఏర్పాటు ఆయెను.

విచారణ జరిగిన స్థలమునుండి చంపుడుగట్టునకు కట్టబొమ్మ కరటయ్యానాయకుని గమనము మేజరు బానర్ మాన్ ఇట్లు వర్ణించుచున్నాఁడు:

"విచారణసమయమున ఒక్కసారికూడ అతఁడు విషణ్ణహృదయుఁడు కాలేదు. అంత సేపును అతఁడు నిర్వికారచిత్తముతోడనే ఉండెను. ఆకులపాటు ఎఱుఁగని అతిధైర్యచిత్తముతో, దైన్యము తెలియని నిర్వికారభావముతో అతఁడు ఉరిశిక్షను స్వీకరించెను. అతఁడు అహంకారమును ఆవంతయు పోనాడ లేదు. అతనిని పట్టుకొనుటలో మనకు మిక్కిలి తోడుపడిన ఎట్టియాపురము పాళెగానిని విచారణసమయమున అతఁడు తఱచు వాడిచూపులతో కసిగా చూచువాఁడు. శివగిరి పాళెగానినికూడ అట్లే చూచువాఁడు. వధ్యస్థలమునకు పోవునప్పుడుకూడ అతఁడు తాను పోవు దారిపొడుగున ఆ ప్రక్కను, ఈప్రక్కను బారులుతీరి కూర్చుండియున్న పాళె

గాంద్రపై అనాదరణవీక్షణములు పఱపుచు ఠీవిగ నడచిపోయి నాఁడు. తనకు ఉరికంబముగ ఉపయోగపడనున్న చెట్టు మొదటికి చేరినతోడనే అతఁడు ఒకే ఒకవాక్యము పలికినాఁడు: 'నాపార్శ్వికుల కాఁపురపుకాణాచియగు పంచాలన్‌కురిచికోట పరిరక్షణముననే పంచత్వమందియుండినచో ఇంతకంటెబాగుండెడిది.' ఈమాటలుతప్ప అతఁడు మఱియేమియు అనలేదు.''

కరటయ్యనాయకుని గండుశత్రువు బానర్‌మాన్ వ్రాసిన వాక్యము లివి. ఈవాక్యములు కరటయ్యనాయకుఁడు ఎట్టివీరుఁడో, మరణ మనిన అతనికి ఎంతనిర్లక్ష్యమో తెల్లగ చెప్పుచున్నవి.

కరటయ్యనాయకునకు తాను చనిపోవుచున్నందుకు ఎంతమాత్రమును విచారము లేదు. ఉన్నచింత అంతయు స్వదుర్గసంరక్షణమున సమరముసాగించుచు చనిపోవక పోయితినికదా యని. వశముతప్పివచ్చినప్పుడుకూడ మహావీరుల చిత్తవృత్తి ఇట్లేకదా ఉండును?

ఆ మహావీరుని వధ్యస్థలము ఇప్పటికిని కయత్తూరున వేర్పాటుగా ఉన్నది. ఇప్పటి కయ్యత్తూరునకు అఱుఫర్లాంగుల ఉత్తరమున ట్రంకురోడ్డునకు ఎడమతట్టున ఆ స్థలమున రకరకాల బొమ్మరాళ్లు చిన్నవి, పెద్దవి గుట్టగా పడిఉండును. ఆ గుట్ట నాఁడునాఁటికి పెద్దది అగుచున్నదే కాని తరుగుటలేదు. అతఁడు వధింపఁబడిన నాఁటినుండి నేఁటివరకు ఆదారినిపోవు ప్రతిమానవుఁడును నాలుగో, ఐదో బొమ్మరాళ్లు ఎత్తి ఆగుట్టపై వైచి కాని ముందుకు అడుగు పెట్టఁడు.

ఆ రాళ్ళగుట్టకు ఒకతట్టున పెద్దరాతిబండ ఒకటి కలదు.

ఆరాతిబండకు భక్తులు జపమాలలు, పూలదండలు కట్టెదరు.

గుట్టప్రక్కనుకల రాతిబండకు పూలదండలు కట్టునట్లే ఆగుట్టచెంతగల చెట్టుకు చెప్పులు వ్రేలాడఁగట్టుట ఇప్పటికిని ఆచారమైయున్నది. వీరవరుఁడు కరటయ్యనాయకుఁడుఅక్కడ ఉరితీయఁబడి నూటయేఁబదియేండ్లు ఐనను ఇప్పటికిని అతని ఆత్మ అక్కడ రాత్రులు సంచారముచేయుచుండుననియు, ఆ సంచారమున అతఁడు ఈచెప్పులను వాడుననియు అచటి ప్రజల నమ్మిక. తొలినాఁడు సాయంతనము చెట్టున కట్టిన క్రొత్త చెప్పులు మఱునాఁడు ఉదయమునకు తొడుగఁబడి తొక్కఁబడి పాఁతగిలిఉండునని ప్రజలు చెప్పుదురు. ఇవి పిచ్చినమ్మకములే కావచ్చును. కాని జగవీర పాండ్య కట్టబొమ్మ కరటయ్యనాయకుఁడు ప్రజాహృదయమున పీఁటపెట్టుకొనిఉన్నాఁడనుటకు ఇవి చక్కని నిదర్శములు కదా!

ప్రజాహృదయమును చూఱఁగొనిన ఆమహావీరునివధ్యస్థలము అతిపావిత్ర్యమును సంతరించుకొని నాఁటినుండి నేటివఱకు బలిస్థలముకూడ ఐఉన్నది. పంటలకు తెగళ్ళు తగుల కుండుటకు, మనుష్యులకు వచ్చిన రోగములు మానుటకు అక్కడ మ్రొక్కుబళ్ళు చెల్లించుకొనుట ఆచారమైనది. ఫలములు సమర్పించుట, వండినఅన్నము కుంభముపోయుట, గొర్రెపొట్టేళ్లను బలిఇచ్చుట మున్నగు మ్రొక్కుబళ్లు నాఁటినుంచి నేటివఱకు నిరాఘాటముగ అక్కడ నిర్వర్తిలుచున్నవి.

ఈరీతి శాశ్వతత్వము కరటయ్యనాయకునకు వచ్చునని బానర్‌మాన్ కలలోకూడ అనుకొనిఉండఁడు. సర్వవిధముల అతనిని, అతనిపాళెమును, అతనికోటను నాశముచేయు

టకే, రూపుమాపుటకే బానర్ మాన్ పూనుకొనెను.

ఉరిశిక్ష విధించి లోకమున కరటయ్యా లేకుండచేసెను.

పంచాలన్ కురిచిపాళెమును రద్దుచేసి దానికి చెందిన గ్రామములలో డెబ్బదితొమ్మిదింటిని దానిపతనమునకు తోడు పడిన ఎట్టియాపురపుపాళెగానికి ఇచ్చెను.

పంచాలన్ కురిచికోటను నేలమట్టము కావించి ఆకోట స్థలమును దున్నించి అందు ఆముదపువిత్తులు చల్లించెను.

సత్తువఅంతయు పోవునట్లుచేసి భూస్వామిని నష్టపెట్టు కుటిలసంకల్పముతో కౌలుఆఖరుసంవత్సరము పొలములోఆము దపువిత్తులు పోడుచు దుష్టకర్షకుని అంతస్తుకు దిగజారి మేజర్ బానర్ మాన్ ఆకోటస్థలమున ఆముదపువిత్తులు చల్లించెను.

అట్లు ఆతఁడు ఆముదములు చల్లించినఏడాఁదినాఁటికే అక్కడ తిరిగి యథారీతిని కోటవెలసి బహువారములు నిలిచి కుంపినిఉద్యోగులను ఎందఱనో బలిగొని, మఱి ఎందఱనో ముప్పుతిప్పలుపెట్టి మూడుచెఱువులనీళ్లు త్రాగించినది.

అది అద్భుతావహమైన విషయము.

అద్భుతావహమైన ఆ విషయమును నెఱపినది జగ వీర పాండ్య కట్టబొమ్మ కరటయ్యనాయకుని కనిష్ఠసోదరుఁడు, మన ప్రస్తుతకథానాయకుఁడు ఐన సుబ్బనాయకుడు.

కరటయ్యనాయకునకు ఇద్దఱు తమ్ములు కలరు. పెద్ద తమ్ముని పేరు కుమారస్వామి. చిన్నతమ్ముని పేరు సుబ్బనాయ కుఁడు. కరటయ్యఅనంతరము పంచాలన్ కురిచిపాళెమునకు కుమారస్వామి వారసు. కాని అతఁడు రోగిష్ఠి. కావుట కార్యకలాపమంతయు అతనితమ్ముఁడగుసుబ్బనాయకునిమీఁద

పడెను. జ్యేష్ఠసోదరుఁడు మరణించుసరికి సుబ్బనాయకుఁడుపాతి కేండ్లయిన నిండని నూనూఁగుమీసాల నూత్నయౌవనుఁడై ఉండెను. కాని అతఁడు మూఁగవాఁడు. మూఁగదొర అని అర్థము వచ్చు ఊమయిదొర అనుపేరుతో అతనిని అరవలు వ్యవహరించిరి.

సుబ్బనాయకుఁడు మూఁగవాఁడేకాని అతిలోకప్రజ్ఞా శాలి. కట్టబొమ్మవంశీయులకు సహజమైన వీరత్వము అతనివద్ద రాశీభూతమై ఉండెను. పైఁగా సైనికవ్యూహనిర్మాణములో అతఁడు మిక్కిలి ప్రజ్ఞామతి ఐ ఉండెను. రణవిద్యలో అతని నైపుణ్యము ఆహాపుట్టించునదిగా ఉండెను.

కనుసంజ్ఞలతో, చేతిత్రిప్పులతో అతఁడు తన అభి ప్రాయములను వ్యక్తీకరించువాఁడు.

ఇంగ్లీషువారనిన కరటయ్యనాయకునికంటెకూడ సుబ్బ నాయకుఁడు ఎక్కువ అసహ్యించుకొనువాఁడు. అతఁడుఇంగ్లీషు వారిని గడ్డిపరకలతో పోల్చువాఁడు. గడ్డిపరకలవలెనే వారిని కూడ ఎగరఁగొట్టివేయవచ్చునని సూచించువాఁడు. ఈసూచ నను అతిచమత్కారముగ చేయువాఁడు—తన ఎడమఅరచేత కొన్ని గడ్డిపరకలు ఉంచుకొని, కుడిచేతిని తలచుట్టు త్రిప్పి, నోటితో ఉష్షునఊఁది గడ్డిపరకలను ఎగరఁగొట్టువాఁడు. ఈగడ్డిపరకలను ఎగరఁగొట్టునట్లే ఇంగ్లీషువారిని ఎగరఁగొట్టి వేయవచ్చునని అతఁడు సూచించువాఁడు.

సుబ్బనాయకుని జనవశీకరణశక్తి కొలఁదులువెట్టఁదరము కానిదిగా ఉండెను. అతని అనుచరులు అతనికోసము ప్రాణ ములనైన తృణప్రాయముగ బలిపెట్టుటకు సంసిద్ధులై ఉండిరి.

కాఁగా అతనిఆజ్ఞ సుగ్రీవాజ్ఞయై చెల్లుచుండెను.

కయత్తూరులో కరటయ్యనాయకుఁడు ఉరితీయఁబడునప్పటికి సుబ్బనాయకుఁడును, అతనిఅన్నకుమారస్వామియు ఇంకను పరారీలోనే తూత్తుకుడిలో ఉండిరి. కాని అచిరకాలముననే వారు కుంపినీవారి సిఫాయీలకు దొరికిపోయిరి. ఆ సిఫాయీలు ఆ సోదరులను పట్టి తెచ్చి పాలంకోటకోటలో ఖైదుచేసిరి.

అందుతో తిరుగుఁబాటు అంతయు సద్దుబాటు ఐనట్లే కనిపించెను.

తిరుగుఁబాటుదారులలో మొనగాఁడు కరటయ్యనాయకుఁడు ఉరికంబమునకు బలి ఐనాఁడు.

అతనికోట పంచాలన్‌కురిచి నేలమట్టమైనది.

అతని సోదరులు పాలంకోటజయిలులో మ్రగ్గుచున్నారు. అందులో ఒకఁడు రోగిష్ఠి. మఱిఒకఁడు వాయిలేనివాఁడు. ఓపికలేని, నోరులేని వారు ఇఁక ఏమిచేయఁగలరు?

కట్టబొమ్మనాయకునితోఁబాటుతిరుగుఁబాటులోపాల్గొనిన నాగలాపురము, కోటార్పట్టి, కాడల్‌గుడి, కులత్తూరు, ఈటయిరాంపన్ని పాళెగాండ్ర పాళెములనుకూడ కుంపినీ ప్రభుత్వము స్వాధీనము చేసికొని వారు తిరిగి తలయెత్తకుండ కట్టుదిట్టములు చేసినది.

ఎల్లెడల శాంతి నెలకొనెను. కాఁగా కుంపినీవారి సేనలలో విశేషభాగము తిరిగి తిరుచునాపల్లికి పోయెను. మేజర్ బానర్‌మాన్ ఇంగ్లాండుకు పోయెను. కొద్ది సేనమాత్రమే తిరునల్వేలిమండలమున ఉండెను. ఆసేనకు మేజరు కాలిన్ మెకాలే నాయకుఁడు. మెకాలే అజమాయిషీలోఉన్న సేనలో కొంత

భాగము శంకరనయనార్ కోయిల్ లో, మఱికొంతభాగము కయత్తూరులో, వేఱొకకొంతభాగము పాలంకోటలో ఉండెను.

పాలంకోటజయిలులో ఉన్న కట్టబొమ్మనాయకులగు కుమారస్వామి, సుబ్బనాయకులను విడిపించుటకు ప్రజలు రహస్యప్రయత్నములు సాగించుచుండిరి. ఆ ప్రయత్నములకుసంబంధించిన కార్యకలాపములకు నాయకత్వమువహించినది సెవటయ్య అను వీరుఁడు. అతఁడు కట్టబొమ్మనాయకులకు దగ్గఱ చుట్టము. వరుసకు బావమఱఁది. అతఁడు మంచిఉపాయశాలి. కాఁగా కుంపినీఅధికారుల నిఘాకు అందక అతఁడు తప్పించుకొని తిరుగుచుండెను. చారులమూలమున పాలంకోటజయిలులోని పరిస్థితులు అతఁడు ఎప్పటికప్పుడు తెలిసికొనుచుండెను.

కయత్తూరులో కట్టబొమ్మ కరటయ్యనాయకుఁడు ఉరికంబమునకు గుఱియై అప్పటికి పదునాలుమాసములు ఐనది. పాలంకోటజయిలులోని ఖైదీలలో కొందఱికి మశూచికము పోసినది. అందుచేత ఖైదీలచేతులకు, కాళ్ళకు బేడీలువేయు ఆచారమును అధికారులు కొంతవఱకు సడలించియుండిరి.

సెవటయ్యనాయకుఁడు ఈవిషయమును తెలిసికొనెను. అది క్రీస్తుశకము 1801–వ సంవత్సరము ఫిబ్రవరి 2–వ తేది. ఆ నాఁడు సెవటయ్యనాయకుని సేవకులు కొందఱు కట్టెపేళ్ళ కావిళ్ళు భుజములవైచుకొని వానిని అమ్ముకొను వంకతో పాలంకోటలో ప్రవేశించిరి. అవసరసమయమున ఉపయోగించుటకు వారు ఆయుధములు గుప్తపఱుచుకొనివచ్చిరి.

రాత్రి తొలిజాము కడచుచున్నది. పాలంకోటలోని కుంపినిఅధికారులు మేజర్ కాలిన్ మెకాలే గృహములోని

ఉద్యానవనమున విందుభోజనపు వేడుకలో ఉండిరి. పగలు కత్తి పేళ్ళ కావిళ్ళతో పాలంకోటలో ప్రవేశించిన సెవటయ్య సేవకులు ఆరాత్రి ఆసమయమున జయిలుఆవరణాలో ప్రవేశించి కావలివాండ్రను సఫాచేసి కారాగారద్వారములు తెఱచిరి. ఖైదీలందఱును కుమారస్వామి, సుబ్బనాయకులతో సహా తప్పించుకొని బయటపడిరి. బయటపడి వారు చేసిన దేమి?

విందులు కుడుచుచున్న కుంపినిఅధికారులను మట్టుపెట్ట ఉంకించిరా? లేదు.

అక్కడికి ముప్పదిమైళ్ళదూరమున ఉన్న తమ కాఁపురపు కాణాచి పంచాలన్ కురిచికోటకు ప్రయాణమైరి. ఆముప్పది మైళ్ల పొడుగున అక్కడక్కడ నూరుగురు కుంపిని కావలివాండ్రు వారిని అడ్డుకొనిరి. అట్లు అడ్డుకొనినవారి ఆయుధములను లాగికొని వారు ముందుకు పోయిరి. ఇంకను తూర్పు తెల్లవాఱకుండగనే వారు ముప్పదిమైళ్ళదూరమును అతిక్రమించి పంచాలన్ కురిచి చేరిరి.

పంచాలన్ కురిచి వారసు కుమారస్వామి, అతని తమ్ముఁడు సుబ్బనాయకుఁడు, వారిముఖ్యానుచరుఁడు సెవటయ్య పంచాలన్ కురిచి చేరినవార్త జలతైలబిందువై పరిసర ప్రాంతములందు వ్యాపించెను. ప్రజలు తండోపతండములుగ వచ్చి వారికి వలసిన సహాయముచేయ నడుములుకట్టిరి.

వేలకొలఁది సేవకులు చేరిరి. వేలకొలఁది సైనికులు చేరిరి. కుంపినివారి ఆజ్ఞలకు అందకుండ తాము దాఁచిఉంచిన ఆయుధసామగ్రి నంతను వారు తమప్రభువునకు సమర్పించిరి.

ఆయుధసామగ్రి అమరినది. ఆ ఆయుధసామగ్రిని ఉప

యోగించుచు సమరము సాగించుటకు సైనికులును అమరి నారు. ఆసైనికులకు సర్వసౌకర్యములు సమకూర్చుటకు సేవ కులను కుదిరినారు. కాని ఆ ఆయుధసామగ్రి దాఁచుటకు, ఆ సైనికులు విడిదిచేయుటకు, ఆ సేవకులు తమ కార్యకలాప ములు సాగించుటకు తగిన దుర్గము ఒకటి వారికి లేకుండెను.

పంచాలన్ కురిచికోటను మేజర్ బ్యానర్ మాన్ నేల మట్టము చేసియుండెను. అది కట్టబొమ్మవంశీకుల కాఁపురపు కాణాచి; తడవులనుబట్టి కట్టబొమ్మనాయకులు ప్రభుత నెఱపిన పవిత్రస్థల మది. ఆకోటస్థలమును రక్షించుచు రణము చేయుచు మరణింపకపోయితినని కట్టబొమ్మ కరటయ్యనాయకుఁడు కడ కాలమున కష్టపడిఉండెను. కాఁగా ఆస్థలమున కాలూదినిలచి కుంపినివారిని ఎదిరించి పోరవలయునని వారు నిశ్చయించిరి.

'కో' అనిన కోటిమంది పలుకుచున్నారు. ఇఁక వారి నిశ్చయము ఫలప్రదమగుటలో ఆశ్చర్య మేమున్నది? వారు కోట కట్టుటకు పూనుకొనినారు. జయిలునుంచి తప్పించు కొనివచ్చిన ఖైదీలు అధికారుల ఆవాసమునకు ముప్పదిమైళ్ల దూరమున మాత్ర ముండి ఆఅధికారులు లోఁగడ నేలమట్టము చేసియుండిన కోటను కట్టుటకు దొరకొనుట! ఎంతటి సాహస కార్యము? రణకోవిదుఁడగు సుబ్బనాయకుని సుగ్రీవాజ్ఞ అది.

ఆకోటను కట్టుటకు దొరకొనిన ముహూర్తబలము ఎట్టిదోకాని పగలు మూడువేలమంది, రాత్రి మూడువేలమంది పనివాండ్రు వారముదినములు సంతోషచిత్తముతో స్వచ్ఛం దముగ రెక్కలుముక్కలుచేసికొనిరి. నల్లటిమట్టిలో తాటి బెల్లపుపానకముపోసి జిగురువచ్చునట్లు తొక్కిన అడుసుముద్ద

లతో క్రొటగోడలు లేపిరి. యథాపురాకారముతో కోటను కట్టిరి. ఆప్రదేశమున తాటితోపులు విస్తారము. ఫిబ్రరిమాసము కల్లుగీత ముమ్మరముగ సాగు కాలము. కాఁగా వారికి తాటిబెల్లపుపానకము అప్పట్టున అవ్వారిగా దొరకినది. ఆ పానకముతో తయారైన అడుసు సిమెంటుకంటె ఎక్కువ జిగి, బిగికలిగి ఉండును. అట్టి చిక్కటిబెందలి తయారుచేయుటకు కాలము అనుకూలించుట ఒకశుభసూచకముగా వారు భావించి ఉత్సాహముతో పనిచేసిరి.

ఇక్కడ వీరిస్థితి ఇట్లుండెను. అక్కడ పాలంకోటలో కుంపెనిఅధికారులు సుబ్బనాయకుఁడుమున్నగువారి పరారీని ఆలవోకగా తలఁచిరి. ఆచిరకాలముననే వారిని తిరిగి పట్టుకొనఁగలమని భావించిరి. భావించి వారిని పట్టుకొనివచ్చుటకు సాయుధులగు భటులను పంపిరి.

పంపిన భటులు సాయుధులే. కాని వారిసంఖ్యస్వల్పము. సుబ్బనాయకుని అతిలోకప్రతిభను అధికారులు ఆకళించలేక పోయిరి. కట్టబొమ్మనాయకులపట్ల ఆప్రాంతమువారికి గల అపారరాజభక్తిని వారు సరిగ అర్థము చేసికొనలేకపోయిరి. బానర్ మాన్ ఆప్రాంతపువారినందఱను నిరాయుధులను చేసినప్పటిలో రహస్యముగ గుప్తపఱుపఁబడిన ఆయుధముల సంగతి వారి అవగాహనమునకు అందలేదు. పంచాలన్ కురిచి రక్షణార్థము అప్పటికే ఐదువేలమంది వీరవరులు పోగుపడి యుండుటయు వారికి తెలియలేదు.

ఈ పరిస్థితులలో వేళ్ళమీఁద లెక్కింపఁదగిన భటులు కుంపినీపక్షమున పోయి కట్టబొమ్మనాయకవీరులను సాధింపఁ

గలరా? సాధింపలేక వారు ఐదవనాఁటికి తిరిగివచ్చి తెల్లమొగ
ములు వైచిరి; చేతులు పిసికికొనుచు నిలువఁబడిరి.

అప్పుడు మేజరు మెకాలే సుబ్బనాయకునితో పెనఁగు
లాట అలఁతివిషయముకాదని గ్రహించెను. సందర్భపడినసైని
కుల నందఱను కూర్చెను. తొమ్మిదివందలమంది సిఫాయిలు
సమకూడిరి. వారిలో పలువురు దేశీయులు. బెంగాలు ఆర్టిలరీ
అను సేనాభాగమునమాత్రము కొద్దిగ విదేశీయులు ఉండిరి.
నవాబుకు చెందిన కొద్దిపాటి అశ్వికదళముకూడ ఉండెను.
సిఫాయిలు జానికిత్రాడుతుపాకిని ప్రయోగింపఁగలవారు.

ఇట్టిసేనతో మేజరు మెకాలే పంచాలన్‌కురిచిమీఁదకు
నడచెను. ఆనడక సుకరముగ సాగలేదు.

పంచాలన్‌కురిచిపాలకుఁడు ఖైదుఖానానుండి తప్పించు
కొనివచ్చి తిరుగుఁబాటుబావుటా ఎత్తెనను వార్త ప్రాంతీయు
లకు అమితోత్సాహము కలిగించెను. కాఁగా వారు మేజరు
మెకాలేసేన నడకకు అడుగడుగున అడ్డుతగులుచువచ్చిరి. కట్ట
బొమ్మనాయకుని సేవకులు ఆసేనను దారిలో ఎన్నివిధముల
కాటింపనగునో అన్నివిధముల కాటించిరి. ఈ కాటింపుల
మూలమున పంచాలన్‌కురిచికి వారి ప్రయాణము తాఁబేటి
నడకను నడచినది.

బందీలు తప్పించుకొనిపోయిన ఐదురోజులకుకాని మేజరు
మెకాలే సేనలు కదలలేదు. అవి కదలి తాఁబేటినడకనుమఱి
రెండురోజులకుకాని పంచాలన్‌కుర్చికి చేరలేదు. ఫిబ్రవరి 9-వ
తేదీఉదయము తొమ్మిదిగంటలకు ఆసేనలు పంచాలన్‌కురిచి
చేరుసరికి యథాపూర్వముగ అక్కడ కోటలేచి నిలిచిఉండెను.

మేజర్ బానర్ మాన్ లోఁగడ కోటగోడలను నేలమట్టముచేసి ఉండెను. ఇప్పుడు తిరిగి ఆగోడలు యథాపూర్వముగ లేచి కుంపినీసైనికులకు ఎదురొడ్డి నిలిచెను.

అంతవఱకు ఆయుధజీవులుగా ఉండిన పలువురకు కుంపిని ఏలుబడిమూలమున వృత్తిపోయినది. వారు శాంతిమయజీవితమును గడపవలసివచ్చినది. ఈమార్పు వారికిఎంతమాత్రమును నచ్చలేదు. కాఁగా సుబ్బనాయకుఁడు కుంపినీవారిమీఁద తిరుగుఁబాటుబావుటా ఎత్తుటతోడనే వారందఱు వచ్చి అతనికి బాసటలై చేతులతీఁటపోవునట్లుగాయుద్ధము చేయుటకుసన్నద్ధులైరి. గోడలు క్రొత్తగా లేచుసరికి కోటలో పదునైదువందలమంది వీరవరు లుండిరి. మేజరు మెకాలే సేనలు అక్కడకు వచ్చుసరికి ఆ వీరవరులసంఖ్య ఐదువేలకు పెరఁగెను.

మెకాలే పరిస్థితులు పరికించెను. తొమ్మిదివందల సైనికబలముతో బయటఉన్న తాను ఐదువేల సైనికబలముతో దుర్గమునఉన్న కట్టబొమ్మ సుబ్బనాయకుని డీకొనుట వివేకము కాదని నిజ మరసెను. అందుచే అతఁడు తనసేనను తిరిగి పాలంకోటకు ఉపసంహరించుకొనుటకు నిశ్చయించెను. ఆ ఉపసంహరణము ప్రారంభించుసరికి మధ్యాహ్నము రెండు గంటలు ఐనది. ఖైదీఐన సుబ్బనాయకుఁడు ఖైదుఖానానుండి తప్పించుకొనివచ్చి కుంపినీసేనానిని వచ్చినదారి పట్టించెను.

వచ్చినదారి నేతిరుగుమొగము పెట్టిపోవుచున్నను అతనికి శత్రుపీడ తప్పలేదు. ఆతిరుగుప్రయాణములో కట్టబొమ్మనాయకునికై జీతగాండ్రు అతనిసేనను నానాబీభత్సము చేసిరి. కప్తాను పాస్సీ ధైర్యసాహసములమూలమున ఆరాత్రి కుంపినీబలము

కట్టబొమ్మనాయకుని పోటును ఒకమాదిరిగా తప్పించుకొనఁ గలిగెను. ఫిబ్రవరి 10-వ తేది ఉదయము తొమ్మిదిగంటలకు ఆ సేనతిరిగి పాలంకోట చేరినది. మఱి పదునేడు దినములవఱకు ఆసేన అక్కడనే పడిఉండెను.

ఎత్తివచ్చిన కుంపినిబలము వెనుకకు పోయినది. అందుతో తిరుగుఁబాటుదారులకు ఉత్సాహము అతిశయించి నది. కంపెనీవారి స్వాధీనములో ఉండిన కోటలనుఒక్కొక్క దానినే పట్టుకొనుటకు వారు ప్రయత్నములు సాగించిరి.

ఆ ప్రయత్నములలో వారు పట్టనెంచిన మొదటికోట కాడల్‌గుడి. అది పితూరీదారులకు లోఁగలేదు. కాని ఆతరు వాత మఱిఎన్నియో కోటలు 'కుంపెనీగవునేరుమెంటుకు' చెంది నవి వారికి స్వాధీనమైనవి. తిరునల్వేలిజిల్లాలోని తూర్పుభాగ మునందలి కోటలన్నియు కొంచెమించుమించుగా వారికి లోఁగి నవి. ఆకోటలతోఁబాటు వేయి తుపాకులు, కొంత మందు గుండుసామగ్రియు వారికి చిక్కినది. తూత్తుకుడికోటకూట వారికి పట్టుపడినది.

ఈ తూత్తుకుడి ముట్టడిలో సుబ్బనాయకుని ఉచితజ్ఞత లెస్సగా ప్రదర్శితమైనది. ఐరోపియను ఒకఁడు ఆకోటను పరి రక్షించుచుండెను. అతనికి ఈదేశపుభాషలలో ఒకటియు తెలి యదు. అతఁడు కోటను ఒకవైపున రక్షించుచుండఁగా అతని క్రింది దేశీయోద్యోగి రెండవవైపుకోటద్వారమును తెఱచి సుబ్బనాయకునిసైనికులను లోన ప్రవేశింపనిచ్చెను. కోటలో ప్రవేశించి సుబ్బనాయకుఁడు అక్కడ కచేరిచేసెను. కోటరక్ష కుఁడగు ఐరోపియనుడుద్యోగినిఅతఁడు విడిచిపుచ్చెను. ఆయు

ధములుమాత్రము తీసికొని ఆకోటలోని సిఫాయిలను అందఱను వదలివేసెను. ఆకోటలోని ఉద్యోగులలో మఱియొకఁడైన బాగట్ అనువానిని—అతఁడు ఆంగ్లేయుఁడగుట—నిర్బంధములో ఉంచెను. ఇంతలో బాగట్ భార్యవచ్చి తనకు పతిభిక్ష పెట్టుమని ప్రార్థించెను. అందుమీఁద సుబ్బనాయకుఁడు అతనిని కూడ వదలివైచెను. మఱికొందరు ఐరోపియనులు—డచ్చివారు—ఆకోటలో ఉండిరి. వారిజోలికి సుబ్బనాయకుడు అసలుపోనే లేదు. వారు ఈయుద్ధమున తటస్థులుకావున వారిని తాఁకరాదని అతఁడు శాసించెను.

కట్టబొమ్మ సుబ్బనాయకుఁడు తూత్తుకుడి మున్నగు తావులందు పొందుచున్న ఈవిజయపరంపరలను చూచి ఇతర ప్రాంతములందలి పాళెగాండ్రును కుంపెనీవారికి ఎదురుతిరుగుటకు సమాయత్తులగుచుండిరి.

పంచాలన్ కుర్చిపాలఁకుడు దుర్గములమీఁదదుర్గములను స్వాధీనముచేసికొనుచుండఁగా కుంపినివారు పటాలములను కూర్చుకొనుచుండిరి. తిరుచునాపల్లినుండి క్రొత్తపటాలములు వచ్చి పాలంకోటలోని సేనలను కలిసినవి. ఇప్పుడు ఆసేనలో మూడువేలమంది ఉండిరి. ఆ మూడువేలమందిసైనికులును పాలంకోటనుండి బయలుదేఱి మార్చిమాసము 27–వ తేదీని కెయిటూరుకు చేరిరి. కెయిటూరునుండి వారు పంచానన్ కురిచికి ప్రయాణమైరి. మేజరు కాలిన్ మెకాలేవారి ప్రధానసేనాని.

దారిలో పెమవాఁతల్లి అనుచోట కట్టబొమ్మనాయకుని గుఱ్ఱపుదళమువారు వారిపై హఠాత్తుగా పడి హంగామా చేసిరి. అప్పటి యుద్ధములో కుంపినివారి సైనికులు కొందఱు

ప్రాణములను కోలుపోయిరి; పలువురు గాయపడిరి. ఈ దెబ్బ నుండి తేఱుకొనుటకు కుంపినివారికి మూఁడురోజులు పట్టినవి.

తుదకు మార్చి 31-వ తేదిని ఉదయము ఎనిమిదిగంటలవేళ కుంపిని వారి సేనలు పంచాలన్ కురిచికి చేరినవి. పండ్రెండు అడుగుల ఎత్తునకు తలఎత్తి కోటగోడలు వారిని ధిక్కరించుచుండెను. చతురస్రములై కోటబురుజులు వారిని వెక్కిరించుచుండెను. ఆ బురుజులమీఁద బందూఖులు బందోబస్తుచేయఁబడి యుండెను. కరటయ్యకాలమునందువలె ఆ కోటచుట్టును ఇప్పుడును ముళ్ళకంపతో కంచెకోటయే కాని కందకము లేదు.

పంచాలన్ కురిచిదుర్గమును ఒకప్రక్కనుండి కుంపిని సైనికులు ముట్టడించిరి. వారికి సహాయార్థము వచ్చిన ఎట్టియాపురము సైనికులు మఱియొకప్రక్కనుండి ముట్టడించిరి.

కయత్తూరులో కట్టబొమ్మ కరటయ్యనాయకుని 1799 అక్టోబరు 16-వ తేదీని ఉరితీయించి ఎట్టియాపురము ఏలిక స్వస్థలమునకు చేరిన నాలుగవనాఁడు (అక్టోబరు 20-వ తేదీని) తామ్రశాసనమును ఒకదానిని చెక్కించెను. అది సాధారణ శాసనములవలె దానశాసనము కాదు. కుంపినివారి ఏలుబడికి తలఒగ్గమని తనప్రజలకు అతఁడు చేసిన హెచ్చరికనుగర్భితమొనర్చుకొనిన శాసన మది. ఆశాసనము అతని ఉనికిపట్టునకు చేరువలో ఉన్న శివాలయమున ఉంచఁబడినది. ఆశాసనము నేఁటికిని ఆశివాలయముననే ఉండి ఆనాటి ఎట్టియాపురము పాళెగాని దేశాభిమానరాహిత్యమునకు అమోఘనిదర్శనమై క్రాలుచున్నది. ఆతని దేశాభిమానరాహిత్యమునకు అలరి కుంపిని వారు అతనికి పంచాలన్ కురిచిగ్రామములను ఎనుబదింటివఱకు

ఇచ్చిరి. ఆ గ్రామములను పొంది తృప్తాస్మి అనుకొనిన అతఁడు ఇప్పుడు తిరిగి పంచాలన్ కురిచి తలఎత్తుటను భరింపఁగలఁడా? భరింపలేఁడు; కావున నే వేయిమంది సైనికులనుకుంపిని వారిపక్షమున పంచాలన్ కురిచిమీఁద యుద్ధము చేయుటకు పంపెను.

కుంపినివారు, ఎట్టియాపురమువారు పంచాలన్ కురిచిని ముట్టడించిరి.

కోటగోడలు పడఁగొట్టుటకు కుంపిని సైనికులు తీవ్రముగ మందుగుండు పేల్చిరి. ఈ పేల్పులు సాగకుండ కట్టబొమ్మనాయకుని భటులు బురుజులమీఁదనుండి బాణములు వేయుచుండిరి.

సాగిన పేల్పులవల్ల కొంత సేపు కోటగోడలనుండి మట్టి పెళ్ళలైన రాలకుండెను. ఆమట్టికి అట్టిజిగురు వచ్చునట్లుగా పాళెగాండ్రు నేర్పు మెఱయించియుండిరి.

కుంపినిఫిరంగుల పేల్పులవలన కోటగోడలమట్టి పెళ్లలైన రాలలేదు. కాని పాళెగానిభటుల బాణములుతగిలి కుంపినివారి సైనికులు పలువురు గాయపడిరి. ఆ పేల్పులలో పాల్గొనుచుండిన నూటయిరువదిమంది ఐరోపియనులలో నలువదిఆఱుగురకు మాత్రమే కాయమున గాయములు పడకుండినవి.

డెబ్బదినలుగురు ఐరోపియనుసైనికోద్యోగులు గాయపడినను లక్ష్యపెట్టక కుంపినివారు పేల్పులు సాగించిరి. ఉదయము ఎనిమిదిగంటలనుండి మట్టమధ్యాహ్నమువఱకు మందుగుండు పేల్పులు సాగుసరికి కోటగోడలలోఒకచోట చిన్నక్రంత ఏర్పడెను. అప్పుడు కుంపెనిసైనికులు ఆక్రంతమార్గమున లోన ప్రవేశించుటకు ప్రయత్నించిరి. క్రంతవఱకు ఎక్కనిచ్చి శత్రుసైనికులను కట్టబొమ్మనాయకుని సైనికులు ఇరువది అడుగుల

పొడుగు ఈఁటెలతో పొడిచి క్రిందికి పడద్రొబ్బువారు. ఈఁటెలతో పొడుచు కట్టబొమ్మ సుబ్బనాయకుని సైనికులు ఎవరును కనిపించువారు కారు. ఈఁటెపోటులుమాత్రము కనిపించి క్రంతవలకు ఎగఁబ్రాకిన కుంపినిసైనికులను అందఱిని నేలకు కూలఁద్రోయునవి.

కుంపినివారికి క్రంతలో కాలూని నిలుచుటకు వీలు చిక్కలేదు. చనిపోయియు, గాయపడియు క్రంతవద్ద క్రింద పడియున్న తమవారిని అట్లే వదలి వారు వెనుకంజవైచిరి. వారి సేనానివేశము ఇఁక అక్కడ ఉండుటకును వలను కాకుండెను. కాఁగా కుంపెనీసైనికులు ఉన్నస్థానమునుండి ఉపసంహరించుకొని అక్కడికి పదునైదువందల అడుగుల దూరమునకు పోయి మకాముపెట్టిరి. క్రొత్తస్కంధావారమునైన వారికి శత్రువుల కాఱింపు తప్పలేదు. అనుక్షణము కట్టబొమ్మనాయకుని భటులు కుంపినీదండు విడిసినచోటుకు పోయి కలగుండు వెట్టుచుండిరి.

మార్చి 31-వరాత్రి కుంపినిసైనికులు ఎటులో వేగించిరి. ఎట్టకేలకు తెల్లవారినది. ఏప్రెల్ 1-వ తేది కుంపిని సైనికులు ఎండలో కోటక్రంతవద్ద ఖననాదిసంస్కారములులేక పడియుండిరి. ఆ కార్యకలాపములు సాగించుటకు అవకాశము ఉండవలెను. కాఁగా తత్కాలికముగ యుద్ధము నిలిపిపెట్ట వలసినదిగా అభ్యర్థించుచు వారు పంచాలన్‌కురిచికోటలోనికి సంధిపతాకనుపంపిరి.

సుబ్బనాయకుఁడు ఎట్టి షరతులనుకాని విధింపక తాత్కాలికసంధికి సమ్మతించెను. ఎట్టి అలజడికాని లేకుండ

కుంపినీవారు యుద్ధభూమిలో గడ్డకట్టిన నెత్తుటితో కప్పఁబడి రూపు చెడియున్న తమ సైనికులను ఎత్తి తీసికొనివచ్చి సైనిక మర్యాదలతో ఆసాయంకాలము పాతిపెట్టిరి. పంచాలన్ కురిచి పాలకుని సైనికులు వారికి ఎట్టి అవరోధమును కలిగించలేదు. ఆ రాత్రికికూడ వారు తాత్కాలికసంధిని పాటించిరి. కుంపిని సైనికులు ఆనాఁటిరాత్రి అదమఱచి నిద్రపోయిరి.

ఏప్రెల్ 2-వ తేది తిరిగి రాయబారాలు నడచినవి. ఈసారి పాళెగానిపక్షమువారు కబురు వెట్టిరి. తమనాయకులను ఖైదు చేయమని కరారు చేయుచో వారు కుంపినివారి పరిపాలనకు ఒడఁబడి కిస్తికట్టెదమనిరి. కుంపినివారు కోరిన సంధిని సుబ్బ నాయకుఁడు ఉదారతతో ఒప్పుకొనిధర్మబుద్ధితో నిర్వహించెను. పాళెగానిపక్షమువారు కోరిన సంధిని షరతులుపెట్టకుండ కుం పెనీవారు అంగీకరింపలేకపోయిరి. ''సాయుధులైనపితూరిదారు లతో మేము వ్యవహరింపఁజాలము. వారు తమనాయకులను మాకు అప్పగించవలెను. తమ ఆయుధముల నన్నింటిని మా పరము చేయవలెను'' అని కుంపినిఅధికారులు చెప్పిరి.

తమ అధినాయకులను, తమ ఆయుధములను అప్పగించి వేయుటకు పంచాలన్ కురిచిభటులు అంగీకరింపలేదు. కాఁగా ఆరాత్రి ఎనిమిదిగంటలకు వారు కుంపినివారి స్కంధావారము మీఁద పడిరి. భోజనములవేళ. పైఁగా అది చీఁకటిరాత్రి. అందుచేత ఆసమయమున అచట విశేషమైనఅలజడి రేఁగినది.

క్రొత్తదండు వచ్చినకాని కుంపినివారి పప్పు ఉడకదని తేలినది. సహాయార్థము క్రొత్తసేన వచ్చువఱకును రెండుమాస ములకాలము కుంపినివారి సేనలు క్రొత్తగా లేచి తమ్ము ధిక్క

శించుచుండిన పంచాలన్ కురిచికోటగోడలను చూచుచు ఊర కుండిరి.

వారు ఊరకుండిరి. కాని పాళెగానిభటులువారిని ఊర కుండనీయ లేదు. చేతనైనవిధముల వీలైనన్నిసారులుపాళెగాని భటులు కుంపినిసైనికులను బాధించిరి. పాళెగానిభటులేకాక ప్రకృతికూడ వారికి పలు బాధలు కల్పించెను. ఈరెండుమాస ములలో రెండుమూఁడుసారులు గాలివానవచ్చి వారిని పూర్తిగ తడిపివేసినది.

మే 21-వ తేదీని క్రొత్తసేనలు వచ్చినవి. మలబారుతీరము నందుండి కొంతసేనయు, మఱియొకతావునుండి అశ్వికదళ మును, తిరుచునాపల్లినుండి తుపాకులసైన్యమును వచ్చినది. ఈ పెద్దసేనను నడుపుటకు మేజరు మెకాలే మున్నగు పాఁతసేనా నులు పనికిరారని నిశ్చయించి కుంపినీవారు లెఫ్టినెంటు కల్నల్ యాగ్ న్యూ అను క్రొత్తసేనానిని పంపిరి.

పెద్దసేన, క్రొత్తసేనాని రణరంగమునకు చేరిరి. మే 23-వ తేది సూర్యోదయమువేళ పంచాలన్ కురిచిదుర్గము ముట్టడి తిరిగి ప్రారంభమైనది. ఈసారి తుపాకులేకాక ఫిరంగు లును పేలినవి. మధ్యాహ్నమువఱకు పేలినవి; సాయంకాలము వఱకు పేలినవి; రాత్రిఅంతయు పేలుచునే యుండినవి. మధ్యా హ్నమునకే కోటగోడకు క్రంత ఏర్పడినది. రాత్రి ఫిరంగులు పేలకుండినచో పాళెగానిభటులు తెల్లవారుసరికి క్రంతను కప్పి యుందురు. కాని అవకాశము లేకపోయినది.

మఱునాఁడు వఱువాత కుంపినిసైనికులు కోటలో ప్రవే శింపఁగలిగిరి. కట్టబొమ్మ సుబ్బనాయకుఁడును, అతని అనుచరు

లును దీటులేని తెంపరితనముతో మధ్యాహ్నము ఒంటిగంటు వఱకు పోరిరి.

ఆమీఁద నలువదియైదునిముసములు సంకులసమరము జరిగినది.

దక్షిణహిందూదేశమున మైసూరుయుద్ధముతరువాత ఇదియే ఘోరయుద్ధము. కుంపినివారు మఱి ఏయుద్ధమునకు కాని ఇంతటి సరంజామ చేసియుండలేదు; ఇంతటి అలజడియు పొందియుండలేదు. మూఁగదొర రణవిద్యాపాండిత్యము, పంచాలన్ కురిచిసైనికుల రణకండూతి ఇందులకు కారణములు.

సమ్మర్దదారుణమైన ఆ రణములో కుంపిని తరపువారు నలుగురు ఆఫీసరులు చనిపోయిరి; ఐదుగురు ఆఫీసరులు గాయపడిరి. సైనికులలో పదియుతొమ్మండుగురు ఐరోపియన్లు, ఇరువదినలుగురు దేశీయులును చనిపోయిరి; డెబ్బదియాఱుగురు ఐరోపియనులును, తొంబదియాఱుగురు దేశీయులును గాయపడిరి.

సమ్మర్దదారుణమైన ఆ రణములో కట్టబొమ్మనాయకుని తరపున నాలుగువందలయేఁబదిమంది చనిపోయిరి. ఇఁక దుర్గము నిలఁబడదని తేలినది. కాఁగా కోటనువిడిచి పాళెగాని భటులు బయటపడిరి. బయటపడి వారు చెదరి పరిభ్రమించి పాఱిపోలేదు. శ్రేణులుకట్టి మామూలు సేనలవలె కదలిపోవఁజొచ్చిరి.

వారు కదలి మూఁడుమైళ్ళదూరము మాత్రము వెళ్ళిరి. అప్పుడు కుంపినివారి ఆశ్వికదళము వెన్నంటివెళ్ళి వారిమీఁద పడెను. ఆ ఆశ్వికదళముధాటికి ఆఁగలేక ఆఱువందలమంది

పాళెగానిభటులు చెల్లాచెదరైరి. మఱి రెండువేలమంది తప్పించుకొనిపోయిరి. అట్లు తప్పించుకొనిపోయినవారిలో కట్టబొమ్మసోదరులు, ఇతర ముఖ్యులును ఉండిరి.

ఆఱువందలమంది పంచాలన్కురిచిభటులను చెదరఁగొట్టి ఆశ్వికదళము తిరిగి వచ్చినది. అప్పుడు సేనాని కల్నల్ యాగ్న్యూ ఎట్టియాపురము సైనికులను పిలిచి రాత్రియగు వఱకు కట్టబొమ్మవారిని తఱిమికొట్టవలసినదిగా ఆజ్ఞాపించెను. కట్టబొమ్మనాయక సోదరులనుకాని, వారి సన్నిహితులను కాని పట్టి తెచ్చినచో బహుమానము ఇత్తునని చెప్పెను.

అప్పటికే మునిమాపువేళ ఐనది. ఐనను ఎట్టియాపురముభటులు బరవసముతో బయలుదేఱి వెళ్ళిరి.

కుంపినివారి ఆశ్వికదళమునకును, పాళెగానిభటులకును కయ్యముజరిగిన పల్లెపట్టున అప్పటికి అలజడి తగ్గినది. కాఁగా ఆ ఊరిలోని స్త్రీలు కొందఱు కయ్యముజరిగినతావునకు వెళ్ళి అక్కడ పడియున్నవారిలో ప్రాణములతోఉండి రక్షింపఁ దగిన స్థితిలో ఉన్నవారికొఱకు వెదకనారంభించిరి.

ఆ వెదకులాటలో ఒక ముసలమ్మకు ఆమెకొడుకు కనిపించెను. గాయపడి యుద్ధభూమిలోశవములనడుమ కొనఊపిరితో ఉన్న తనకొడుకును ఆమె ఇంటికి తీసికొనిపోవ ఆయత్తపడినది. అప్పుడు ఆమెకొడుకు ఆమెతో ఇట్లు చెప్పెను:

"అమ్మా! నేను సామాన్యసైనికుఁడను. నావంటి సైనికులకు అనేకులకు నాయకుఁడైన మూఁగదొర నావలెనే గాయపడి మూర్ఛితుఁడై ఆప్రక్కను పడియున్నాఁడు. నన్ను ఇంటికి తీసికొనిపోవుటకు ప్రయత్నించకుము. నాబదులు నా

స్వామిఅగు ఆమూఁగదొరను-కట్టబొమ్మసుబ్బనాయకుని-మన ఇంటికి తీసికొనివెళ్లుము.'' ముసలమ్మ ఇది వినెను. తనకొడుకు రక్షణకంటె సుబ్బనాయకునిరక్షణ దేశహితమని ఆమె ఆకళించెను. కాఁగా ఆమె కొనఊపిరితోఉన్న కొడుకును ఆ స్థలమున విడిచి గాయమునుండి కాలవగట్టి రక్తము కారుచుండుటచే మూర్ఛితుఁడై ఉన్న కట్టబొమ్మనాయకుని ఇంటికి తీసికొనవెళ్ళెను. అక్కడ అతనిగాయములకు కట్లు కట్టెను. మాతృహృదయము, దేశాభిమానము కల మఱికొందఱు స్త్రీలను జతచేసికొని అతనికి ఉపచారములు చేయఁబూనెను.

ఇంతలో అక్కడికి సేనాని యాగ్న్యూ పంపిన ఎట్టియాపురముసైనికులు వచ్చుచున్నట్లు తెలియవచ్చెను. ఐనను ఆస్త్రీలు భయపడలేదు. అబద్ధమాడియైనను అతనిని రక్షించుటకు నిశ్చయించుకొనిరి.

ఆఁడుది బొంకిన గోడకట్టినట్లు ఉండునందురుకదా!

పండుకొనిఉన్నసుబ్బనాయకునిమీఁద నఖశిఖపర్యంతము వారు గుడ్డ కప్పివేసిరి. శవముదగ్గఱ కూర్చుండి ఏడ్చుచుండుటను అభినయించిరి. ఇంతలో ఎట్టియాపురముసైనికులు అక్కడకువచ్చి విషయ మేమి అని అడిగిరి. అప్పుడు ఆస్త్రీలు యువకుఁడుఒకఁడు మశూచికముసోఁకి మరణించినట్లు బొంకిరి. చావునకు తెగించి సమరముచేయుట వృత్తిగా కలవారయ్యు ఆ సైనికులు మశూచికమువలని మరణమని అనుటతోడనే అమ్మవారికి హడలి మఱి ఆగ్రామమున నిలువకుండ ఆమడకు అడుగులు వైచుచు వెడలిపోయిరి.

అట్లు ఆ ఆడువారి అబద్ధముచే రక్షితుఁడై అతఁడు

తేరుకొని కుంపినివారికి అందకుండ తప్పించుకొనిపోయెను.

ఈ ఉదంతము కట్టుకథ కాదు. కుంపినివారి రికార్డు లలో గ్రథితమై ఉన్నది. పంచాలన్ కురిచియుద్ధమున కుంపిని సేనలో ఉద్యోగిగా ఉండిన వెల్షు ఈగాథను తాను రచించిన గ్రంథమున చెప్పియున్నాఁడు.

ఈ ఉదంతమువలన సుబ్బనాయకునిపట్ల నాఁటివారికి ఎట్టి ప్రపత్తిఉండినదో తేటతెల్లమగును. ముసలమ్మకొడుకు అతనికొఱకు తనజీవితమునే ధారపోసెను. ముసలమ్మ అతని కొఱకు తనకొడుకునే వదలుకొనెను. ఉపచారములు సలుపు చుండిన స్త్రీలు అతనికొఱకు పచ్చిఅబద్ధము ఆడిరి. ఎటులైన అతనిని రక్షింపవలెనని ఈ త్యాగములు, ఈతిరుగుళ్ళు. ఆనాఁటి వారు సుబ్బనాయకుని దేవాంశసంభూతునిగ నమ్మికొలిచిరి.

ఇట్లు ఆ తల్లికొడుకుల, ఆ పల్లెపడుచుల అసామాన్య స్వామిభక్తివలన సంరక్షితుఁడై బ్రతికి ఆమూఁగదొర కుంపిని వారిని తిరిగి కొంతకాలము ముప్పుతిప్పలు పెట్టెను. మే 24-వ తేదీని గాయములతో పడిన ఆతఁడు జూన్ 7-వ తేదికి బాగుగ తేరుకొని తన కార్యకలాపములు నిర్వర్తింప కలిగెను.

కట్టబొమ్మ సుబ్బనాయకుఁడు, అతని సోదరుఁడు, ముఖ్యానుచరులు కుంపిని సైనికులకు కాని, ఎట్టియాపురము సైనికులకు కాని దొరకకుండ శివగంగసంస్థానములోని సిరువయల్ అను తావునకు పోయిరి. శివగంగసంస్థానపు ప్రజానీకము తమ ఏలికలగు పెద్దమారుతు, చిన్నమారుతు అను ఇరువురి నాయకత్వమున ఇరువది వేలమంది గుమికూడి సుబ్బనాయకునకు, అతని అనుచరులకు ఘనమైన స్వాగతోపచారమును సలిపిరి. పంచా

లన్ కురిచి పాలకులకొఱకు వారు పల్లకిబోయీలను పంపిరి. బాజాబజంత్రీలతో ఊరేఁగించుచు సిరువయల్ కు తీసికొని వెళ్ళి హారతు లిచ్చి తమతల్లి భవనమున వారిని విడియించిరి.

మారుతుసోదరులు చేయెత్తుమనుష్యులు, భీమబలులు. అందు పెద్దవాఁడైన వల్లి ఆనాఁటి ఆర్కాటురూపాయలను వేళ్ళసందున నొక్కి వంచఁగలుగువాఁడు; గుహాలలోకి, పొదలలోనికి నిరాయుధుఁడుగా పోయి అందలి పులిని బయటికి ఈడ్చి తెచ్చి చంపువాఁడు. అతఁడు జగదేకధానుష్కుఁడు. అతని సోదరుడు చిన్నమారుతుకూడ అట్టివాఁడే.

రణకోవిదుఁడైన సుబ్బనాయకునకు ఇప్పుడు భీమబలులైన మారుతుసోదరుల తోడ్పాటు దొరకినది. మఱికొన్ని నెలలు సమరము సాగించికాని కుంపినివారు వారిని సాధించలేక పోయిరి.

కుంపినివారిచేతులలో పడకుండ పితూరీదారులు సిరువయల్ మున్నగు తమగ్రామములను పరశురామప్రీతి కావించిరి. సాంద్రారణ్యమధ్యనుండి దుర్గమమైన కలయర్ కోయిల్ అను దుర్గములో వారు తలదాఁచుకొనిరి. అడవిగుండా మూఁడుమైళ్ళదూరము కొత్తగా కంకరరోడ్డు వైచి ఆ దుర్గమును ముట్టడించుటకు కుంపినివారు ప్రయత్నించిరి. కాని ఆరోడ్డు మార్గమున వారికి సరఫరాలు రాకుండ పితూరీకోరులు అడుగడుగున అవరోధములు కలిగించుచు వచ్చిరి. పైఁగా ఆ ప్రాంతము రోగభూయిష్ఠప్రదేశము. శత్రువుల నిరంతర ప్రబలావరోధమువలన, అనారోగ్యభయమువలన రోడ్డుపనిని కుంపినివారు నడుమను విరమింపవలసినవారైరి.

కుంపినివారు మఱియొక దిక్కునుండి 1801 అక్టోబరు 1-వ తేదిని ఆ కోటను ముట్టడించిరి. లోఁగడ రోడ్డు వేయుద మనుకొన్న మార్గమున అన్నిఁటిని తెగించిన సాహసోపేతులయిన కొందఱు సైనికులను పంపిరి. వారు ఆ మార్గమున పోయు రోడ్డుపని సాగుచుండినప్పుడు తమమీఁదకు పితూరిదారులు తఱుచు వచ్చుచుండిన అడ్డుదారులన్నియు తెలిసికొనిరి. ఆ అడ్డుదారుల వెంట పోయి వారు ఆకోటను రెండవదిక్కునుండి కూడ ముట్టడించిరి.

ఇరువైపులనుండి ముట్టడి. కోట ఇరుకున పడినది. కోట లోనివారికి ధైర్యము చిటిలినది. కాకులుదూరని కాఱడవిలో ఉన్నను వారికోట కుంపినివారికి స్వాధీనమైనది. తలదాఁచుకొను తావులేక వారు అడవులఁబట్టిరి. కుంపినివారు ఆఅడవులన్నియు గాలించి పితూరీకోరులను అందఱను పట్టుకొనిరి.

పట్టువడినవారిలో వల్లిమారుతు, అతని సోదరుఁడు, కట్టబొమ్మ సుబ్బనాయకుఁడు, అతని సోదరుఁడు, ముఖ్యానుచరులు ఉండిరి. వారిలో డెబ్బదిఇద్దఱను సముద్రములకు అవతలఉన్న ప్రిన్సుఆఫ్ వేల్సు దీవికి పంపివైచిరి. మారుతు సోదరులకు, కట్టబొమ్మసోదరులకు ద్వీపాంతరవాసశిక్ష చాలదని నిర్ణయించి కుంపినివారు ఉరిశిక్ష విధించిరి.

సుబ్బనాయకుని, అతనిసోదరుఁడు కుమారస్వామిని పంచాలన్‌కురిచికి తీసికొని వెళ్ళిరి. అక్కడ వారిని ఉరితీసిరి.

పంచాలన్‌కురిచికోటను నేలమట్టము కావించి ఆస్థలము నంతను గాడిదలకు మెట్టనాగళ్ళు కట్టి దున్నించి జిల్లేళ్ళు, రేఁగులు విత్తిరి.

అంతతో తృప్తినిపొందక ఆస్థలమున ఉప్పును చల్లించిరి.. గవుసేరు మెంటురి కార్డులలో పంచాలన్ కురిచినామము లేకుండ చేసి దానిని బేచిరాకు చేసిరి.

ఆముదపు వెదలు వేయించి అచటి నేలసార మంతయు లాగివేయవలెనని నాఁటి కుంపిని సేనాని మేజర్ బానర్ మాన్ లోఁగడ ప్రయత్నించెను. కాని అతని ప్రయత్నము పండఁబాఱ లేదు. ఆ నేల నిస్సారము కాలేదు. అక్కడ తిరిగి కోట మొలిచి కుంపినివారిని ధిక్కరించినది. నేఁడు ఆకోటను కూల్చి ఆస్థలమును గాడిదలచేత దున్నించి అక్కడ జిల్లేళ్ళు ఉమ్మెత్తలు మొలిపించవలెనని కుంపిని సేనానులు అనుకొనిరి. కాని అట్లును జరగలేదు. కోటస్థలమున ఉండిన పెద్దపెద్ద మోట నూతులనుండి నీరు తోడి కర్షకులు ఇప్పటికిని అక్కడ మెట్ట పంటలు పండించుచు జిల్లేళ్ళు, ఉమ్మెత్తలు మున్నగు రుప్పలే కాక గడ్డిగాదము మున్నగు కలుపుసైతము మొలవకుండ చేయుచున్నారు.

ఉప్పును చల్లించి ఆ కోటస్థలమును ఉప్పుపట్టిగా చేయవలయునని కుంపినివారు తలఁచిరి. కాని ఆ కోటభూమి ఊషర క్షేత్రము కాలేదు. కుంపినిగవుసేరు మెంటువారి ఉప్పుస్పర్శతో అపవిత్రమైన పై మన్ను వానకు కొట్టుకొనిపోయినప్పుడెల్ల ఆ తావున ఇప్పటికికూడ ఆనాఁటి బంగారునాణెములు, వెండి నాణెములు దొరకుచున్నవి.

పంచాలన్ కురిచిని బేచిరాకు చేయుటచే దానిస్మరణము లేకుండ చేయవలెనని కుంపినివారు సంకల్పించిరి. మ్యాపులలో ఆనామమును మాపుచేసిరి. రికార్డులలో ఆనామము లేకుండ

చేసిరి. కాని ప్రజాహృదయమునుండి పంచాలన్‌కురిచి ఉదంత మును తుడిచివేయలేకపోయిరి.

పంచాలన్‌కురిచివీరగాథను కవిహృదయముకల నమశ్శివాయము అను దేశభక్తుఁడు తమిళమున రసోదంచితమగు పెద్దకావ్యముగ రచియించెను. తెనుఁగున పల్నాటివీరచరిత్ర, బొబ్బిలిరాజుకథలవలె ఆగ్రంథము అరవమున విశేషవ్యాప్తిని అందెను. దానికి పంచాలన్‌కురిచిసింధువు అనిపేరు. అది నలువదిఆశ్వాసముల పెద్దగ్రంథము. ఆ కావ్యమునకు కలియుగ భారతమను ప్రసిద్ధి. అందు నాలుగువేలద్విపదలు కలవు. కట్టబొమ్మవంశీకుల వంశగాథ అందు మొదటినుండియు కలదు. జాక్సన్ కాలమునుండి ఇంగ్లీషువారితో వారికి ఉండిన సంబంధము ఒడలుపులకరించునట్లు వర్ణితమైనది. ఆ కావ్యమునందలి ఉద్వేగము, ఉరవడి నిరుపమానములు. ఆ కావ్యమును బ్రిటీష్ ప్రభుత్వమువారు నిషేధించిరి. కాని ఆ కావ్యపు వ్రాతప్రతులు ఆప్రాంతమున చదువుకొనినవారున్న ప్రతిగృహము నందును ఉండెను. తిరునల్వేలి, రామనాథపురము, మధుర మండలములలో ప్రతివ్యక్తి నోటికిని ఆగ్రంథమునందలిపదమో, పాటయో ఒకటి వచ్చిఉండును. కట్టబొమ్మనాయకులవీరగాథను ప్రస్తావించుగ్రంథములు తమిళమున పరశ్శతములుగా ఉన్నవి. ఆ భాషలో ఆకథల నవల, నాటకము మున్నగు వాఙ్మయరీతులను పెక్కింటిని అందినది. ఆంగ్లమునకూడ పలు చారిత్రక గ్రంథములలో ఆ గాథ విపులీకృతమైఉన్నది. వీరయువకుఁడు సుబ్బనాయకుఁడు సాగించిన పాళెగారియుద్ధమున కుంపినితరఫున సైనికోద్యోగిగా ఉండిన బ్రిటిష్ పౌరుఁడు కల్నల్ జేమ్సు వెల్షా

మిలిటరీ రెమినిసెన్సెస్ అను గ్రంథమును 1830లో ప్రచురించెను.

వెల్షు బ్రిటిష్ ఉద్యోగి. ఐనను అతని రచనము నిష్పాక్షికమై ఉన్నది. ఊమయిదొర కట్టబొమ్మ సుబ్బనాయకుని గురించి వెల్షు వెలిబుచ్చిన అభిప్రాయములు చదువదగిన వి

"కుంపిని ఉద్యోగులు కట్టబొమ్మనాయకుని పిల్లి అను పేరుతో వ్యవహరించువారు. కాని దేశీయులు అతనిని ఊమయి దొర అని పిలుచువారు. దేశీయులు అతనిని దేవాంశసంభూతునిగ తలఁచిరి. అతని సంజ్ఞ వారికి వేదప్రమాణమై ఉండునది. ఒక్కఁడు నిర్వహింపఁదగు అతని చిన్న ఆజ్ఞకుకూడ పదుగురు పరుగెత్తువారు సేవకులు ఆతనికి వశవిధేయులై ఉండిరి. అతని దేశభక్తి సాటిలేనిది. అతని శౌర్యము అకుటిలమైనది. ఈ యుద్ధములో ప్రతి కార్యకలాపమునందును అతడు సాహసముతో పాల్గొనువాఁడు. అపాయములను అతఁడు అట్టె తప్పించుకొనువాఁడు. కుంపినివారి సైనికులలో, ఎట్టియాపురము సైనికులలో ప్రతిఒకరును అతనిని పట్టుటకు, చంపుటకు నిఘా పెట్టిఉండిరి. అతఁడు వారికి దొరకనేలేదు. అతఁడు పరారీలో ఉండఁగా అతనిని పట్టుకొనినవారికి గొక్క బహుమానము ఇత్తుమని ప్రభుత్వమువారు ప్రకటించిరి. దొరకినతరువాత అతనిని పాలంకోటజయిలులో కాలుసేతులకు బేడీలు వైచి నిర్బంధించిరి. తన్ను ఇట్లు చేసిన ఆంగ్లేయులనిన అతఁడు కంటగించుకొనువాఁడు. కంటగించుకొని కదనముచేసినాఁడు. కాని ఒకసారి కూడ ఆ యుద్ధమున అతఁడు ధర్మచ్యుతుఁడు కాలేదు. తూత్తుకుడియుద్ధమున తనకు దొరకిన ఆంగ్లేయోద్యోగుని అతని భార్య ప్రార్థనమువిూఁద విడిచిపుచ్చినాఁడు. పంచాలన్ కురిచివద్ద

కట్టబొమ్మ సుబ్బనాయకుడు పునర్నిర్మించిన పంచాలన్‌కురిచికోట



సుబ్బనాయకుడు పునర్నిర్మించిన పంచాలన్ కురిచికోటబొమ్మను వెల్షు తన 'మిలటరీ రెమిని సెన్ సెస్' గ్రంథమున చేర్చెను. యుద్ధానంతరము ఆ కోట నేలమట్టము చేయబడినది. నేలమట్టము చేయబడక పూర్వపు ఆ కోట ఆకృతిని నేడు తెలుపుటకు వెల్షు ప్రకటించిన ఆ బొమ్మ ఒక్కటే ఆధారము. ఆ గ్రంథమునుండి ఎత్తినది ఈ చిత్రము.

పడిన కుంపినిసైనికులకు ఖననాదిసంస్కారములు సలుప తాత్కాలిక యుద్ధవిరామసంధి కోరఁగా అతఁడు ఎట్టి షరతులుకాని పెట్టకుండ ఒప్పుకొనినాఁడు. అట్టివాని పక్షమున తీయుమాటలురాఁగా కుంపినివారు నిరాకరించిరి.''

శివాజిని మొగలులు 'కొండఎలుక' అనినట్లే సుబ్బనాయకుని ఆంగ్లేయులు 'పిల్లి' అనిరి. ఆ 'పిల్లి'గాఁడు పాళెగారి యుద్ధమున నిర్ధార్యుఁడు, నిర్జేత, నిర్దిష్టుఁడై ఎట్టిదద్దుటలందును ధైర్యమువీడలేదు. ఆపిల్లిని పిలుకుమార్చుటకు వారు రెండేండ్లు కష్టపడిరి; రెండుసారులు దండయాత్రలు సలిపిరి; రెండువేల మందిని నష్టపోయిరి, వేలకొలఁది ధనము వెచ్చించిరి.

1857-వ వత్సరమునాఁటి సిపాయికలహమును సాధారణముగ ప్రథమస్వాతంత్ర్యయుద్ధ మని చరిత్రకారులు అందురు. ఆ యుద్ధము నిర్వహింపఁబడిన ఉద్దేశముతోడనే అప్పటికి అఱువదియేండ్లకు పూర్వము కట్టబొమ్మనాయకులు పాళెగారి యుద్ధమని పిలువఁబడు స్వాతంత్ర్యసమరమును సాగించిరి. కాఁగా బ్రిటీష్ మహాయుగపు స్వాతంత్ర్యయోధులలో కట్టబొమ్మనాయకులు మొదలిజట్టువారు. ఆ మొదలిజట్టు స్వాతంత్ర్యయోధులలో కట్టబొమ్మ సుబ్బనాయకుఁడు యువకుఁడు. స్వాతంత్ర్యసమరములో మరణించుసరికి అతని పెద్దన్న ముప్పదిఏండ్లవాఁడు; చిన్నన్న ఇరువదియైదేండ్లవాఁడు; అతనికి ఇరువదేండ్లకు పైఁబడినవి.

అతఁడు జాతికి ఆంధ్రుఁడు; ఉండినది అరవదేశమున; కట్టినది పాళెగానిపట్టము; తిరుగఁబడినది కుంపినిమీఁద; సాగించినది సాహసోపేతసమరము; నెఱపినది విక్రమము.

కుంపిని వారు అతనిమీఁద కూడని కసి పట్టిరి. కట్టబొమ్మ నామమును, కట్టబొమ్మవారి కాఁపురపు కాణాచియగు పంచాలన్ కురిచిని వారు తుడిచి పెట్టివేయవలయునని కాంక్షించిరి.

కాని వారి కాంక్ష నెఱవేఱలేదు. ఇప్పటికిని కట్టబొమ్మ నామము దక్షిణాదిని సుప్రసిద్ధమై ఆ నామము ఉచ్చరింపఁబడునప్పుడు ఒకవిధమైన పూజ్యభావము ద్యోతకమగుచుండును. కట్టబొమ్మనాయకుల వీరగాథలగుఱించిన గ్రంథములపై నిషేధము 1947 ఆగష్టు 15-వ తేదిని తొలగింపఁబడినది. కయత్తారులోని బోర్డు ఉన్నతపాఠశాలను వీరపాండ్య కట్టబొమ్మ ఉన్నత పాఠశాల అనునామముతో వ్యవహరింపవలయునని 1950లో తిరునల్వేలిబోర్డు తీరుమానించినది. అరవ దేశమున పలుప్రాంతములందు ఏఁటేఁట కట్టబొమ్మజయంతి జరుపఁబడుచున్నది.

అరవలచే పూజింపఁబడుచున్న ఆంధ్రమహాశయులలో జగవీర పాండ్య కట్టబొమ్మ సుబ్బనాయకుఁడు ఒకఁడు. అరవలచే పూజితులగుచున్న త్యాగరాజు, తిరుమలనాయకుఁడు మున్నగు ఆంధ్రమహాశయులందఱకంటె సుబ్బనాయకుఁడు మిక్కిలి పిన్నవాఁడు. ఆ పిన్నవాఁడు ఆంధ్రకీర్తిని ఆంధ్రేతరప్రాంతములలో అభ్రంకషస్థానమునకు కొనిపోయినాఁడు. కావున కవితో కంఠము కలిపి ఆ కీర్తివిస్తారుని ఇట్లు ప్రస్తావింతము:

ఉ. ఏరు తెలుంగునాఁడు వెలయించిరొ యెవ్వరు దాని యెల్లలన్
దూరముగా సుదూరముగఁ గోడ్గొనిపోయిరొ యెవ్వరందుఁ గ
వ్వారిగఁ బోర నిల్వఁబడి ప్రాణము రక్తము ధారపోసిరో
వారి పదాలముందు తలవాల్చి పోదము ముందుముందుకున్.

—వేలూరి శివరామశాస్త్రి

# కృతజ్ఞత

ఈ గ్రంథరచనమున తోడుపడిన గ్రంథములు కృతజ్ఞతా పూర్వకముగ ఇచట పేర్కొనబడుచున్నవి :

1. History of The Reddi Kingdoms By M. Somasekhara Sarma.
2. Glimpses of the Nizams Dominions—Campbell A. Claude.
3. Velugotivarivamsa Charitra—Edited by N. Venkata Ramanayya
4. History of Tanjore Nayaks—Vriddhaganesan
5. Manual of the Kistna District—Mackenzie. G.
6. Account of Tinnevelly District—V. S. Padmanaba Ayyer
7. Pudukkottai State – Radhakrishna Aiyar, B.A.
8. Account of the Panjalan Courchy Poligars—Rev. J. F. Kearns.
9. Ettiyapuram Past & Present—W.E. Ganapathi Pillai
10. Manual of Tinnevelly District
11. Madras Census Report (1891)—H. A. Stuart
12. History of Tinnevelly—Caldwel R.
13. Military Reminiscences Vol. I—Colonel James Welsh
14. Fall of the Southern Gibralter—H. R. Krishnan I.C.S
15. తంజావూరు ఆంధ్రరాజులచరిత్ర—సంపాదకుడు—వేటూరి ప్రభాకరశాస్త్రి
16. రెడ్డిసంచిక—సంపాదకుడు వడ్డాది అప్పారావు
17. తంజావూరు ఆంధ్రనాయకచరిత్ర—కురుగంటి సీతారామయ్య
18. రాజగోపాల విలాసము—చెంగల్వ కాళకవి
19. అనితల్లి కలవచేఱు శాసనము—సాహిత్యపరిషత్ పత్రిక
20. వీరపాండ్యకట్టబొమ్మన్ (అరవము)—శివజ్ఞానము

Printed at the Weldun Press, Madras-21.